# ఆంధ్రపత్రిక

317592



The Andhra Patrika, Madras. } Regd. No M. 1118 Vol. 36 No 233 SATURDAY 26th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# భారతసమాఖ్యలో తాత్కాలికంగా హైదరాబాద్ సంస్థానం చేరిక



## అణుశక్తి ఉత్పత్తి అంతర్జాతీయ అజమాయిషీ

### రష్యా అంగీకార పునరుద్ఘాటన: విషిన్స్కీ ప్రకటన

ఫ్లషింగ్ మెడోస్, నవంబర్ 23: గనుల నుండి తీసే ముడిపదార్థాల లగాయతూ, వస్తువు పూర్తిగా తయారయ్యే టంతవరకూ అన్ని దశలలోనూ, అణుశక్తి ఉత్పత్తిపై అంతర్జాతీయంగా అజమాయిషీకి రష్యా సమ్మతిస్తుందని, రష్యన్ ప్రతినిధి విషిన్స్కీ నేడు ఐక్యరాజ్య సమితిలో పునరుద్ఘాటించాడు. అణుశక్తి ఉత్పత్తిపై అంతర్జాతీయంగా అజమాయిషీ నెరపే సంఘం, భద్రతా మండలికి లోబడి పనిచేస్తుండాలని రష్యా పథకం సూచించింది. భద్రతా మండలిలో రష్యాకు వీటో అధికారం ఉన్నది గనుక అణుశక్తి ఉత్పత్తిపై అజమాయిషీకి ఒప్పుకున్నా రష్యాకు అపాయమేమీ ఉండదు.

"అణుశక్తి మానవాభ్యుదయ కార్యములకు వినియోగింపబడుతుందా? అనే అనుమానం రష్యాకి యింకాపోలేదు. అమెరికా ఆటంబాంబులను, నిల్వచేస్తున్నంత కాలమూ, రష్యాలేనయుద్ధసామగ్రి ఉత్పత్తి కర్మాగారాలను రహస్యంగానే ఉంచుతుంది. అణుశక్తికంట్రోలు అమెరికా ప్రతిపాదించిన ప్లానును గతసంవత్సరం సమితి ఆమోదించింది ఏనాటికైనా ప్రపంచంలో అణుశక్తి ఉత్పత్తికి వినియోగపడే సాధనసంపత్తినంతా తనచేతుల్లోకి తెచ్చుకోవాలనే అమెరికా ఉద్దేశ్యం. ఈ దొంగవ్యవహారాలు సాగడానికి వీలు లేకుండా చేయాలనేరష్యా పథకంయొక్క ఉద్దేశ్యం.

## జనవరి 26 నుంచీ నూత్నరాజ్యాంగం అమలు

### ప్రవేశపత్రంపై నిజాం సంతకం

### భవిష్యత్ సంబంధాలు నిర్ణయించేది సంస్థాన ప్రజా పరిషత్తేనని ఫర్మానా

హైదరాబాదు, నవంబరు 24: హైదరాబాదు సంస్థానమును భారత యూనియన్‌లో చేరుస్తూ నిజాం నవాబు ప్రవేశపత్రంమీద సంతకం చేశారని నేటి రాత్రి ఇక్కడ ప్రకటన వెలువడింది.

నూత్న భారతరాజ్యాంగము అమలులోకి వచ్చే తేదీనుండి, దానిని హైదరాబాదుకు కూడా వర్తింపజేస్తూ నిజాం నేటిరాత్రి ఒక ఫర్మానాను జారీచేశారు.

"భారత రాజ్యాంగపరిషత్తు త్వరలో అవలంబించబోయే రాజ్యాంగం ఇండియాలోని ఇతర భాగాలకు వలెనే హైదరాబాదుకు కూడా వర్తిస్తుంది," అని ఫర్మానాలో ప్రకటింపబడింది.

నిజాం చేసిన ఈ నిర్ణయం ముందు ముందు సంస్థాన రాజ్యాంగ పరిషత్తుచే ధ్రువపరచ బడవలసి వుంది కనుక, ఇది తాత్కాలిక ప్రవేశమేనని ఇక్కడి అధికారులు భావిస్తున్నారు.

ఫర్మానాసారం

"హైదరాబాదు సంస్థానం మిగతా

(2వ పేజీ చూడుడు)



# త్వరలో ఆంధ్రరాష్ట్ర విభజన

## మద్రాసు రాష్ట్ర విభజన సంఘం

### కర్ణాటకులకు కేరళులకు ప్రాతినిధ్యము కావలెనట

న్యూఢిల్లీ, నవంబర్ 24: మద్రాసు నూతన ఆంధ్ర రాష్ట్రముల మధ్య అప్పులను ఆస్తులను విభజించుటకును, సరిహద్దులను నిర్ణయించుటకును ఏర్పరుపదలచుచున్న సంఘములో కర్ణాటకమునకును, కేరళమునకును ప్రాతినిధ్యముండవలెనని కర్ణాటక కాం. సంఘాధ్యక్షుడు శ్రీ ఎస్. నిజలింగప్పగారు నేడొక ప్రకటనలో కోరుచున్నారు.

'కేరళము, కర్ణాటకము యిప్పుడు మద్రాసు రాష్ట్రములో అంతర్భాగముగా నున్నది. ఆంధ్రమునకును, కర్ణాటకమునకును మధ్య దీర్ఘమైన సరిహద్దు కలదు. కన్నడులు, మలయాళీలు మైనారటీలో నున్నారను కారణమున వారికి ప్రాతినిధ్యమొసంగకపోవుట అత్యంత శోచనీయముగానుండును' అని శ్రీ నిజలింగప్ప గారు చెప్పుచున్నారు.

## సంఘ నియామకం

### మద్రాసు ప్రభుత్వాన్ని భారత ప్రభుత్వం కోరనున్నది

న్యూఢిల్లీ, నవంబరు 24: ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి భారత ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించింది. ఈ నిర్ణయాన్ని పురస్కరించుకొని భారతప్రభుత్వం త్వరలోనే మద్రాసురాష్ట్రప్రభుత్వానికి ఒక ఉత్తర్వు పంపగలదనీ, ఈ ఉత్తర్వులో నూతనరాష్ట్రనిర్మాణ ప్రక్రియలో మద్రాసు ప్రభుత్వం చేతిమీదుగా నడవవలసిన కార్యకలాపం అంతా సూచించబడుననీ, విశ్వసనీయంగా తెలియవచ్చింది.

1950 జనవరి 26వ తేదీలోగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించేయెడల ప్రస్తుత భారతప్రభుత్వచట్టంలోని 290వ సెక్షన్‌క్రింద గవర్నరు జనరల్ ఒక ఉత్తర్వు జారీ చేస్తే చాలును, కాని రాష్ట్రనిర్మాణం తదనంతరం జరిగితేమాత్రం నడపవలసిన తంతు చాలా పెరుగుతుంది. నూతన రాజ్యాంగంక్రింద రాష్ట్రనిర్మాణం జరపాలంటే, భారత యూనియన్ అధ్యక్షుడు రాష్ట్రశాసనసభతో సంప్రదించి ముందుగా వారి అభిప్రాయాన్ని తెలుసుకోవాలి, అమీద యూనియన్ ప్రభుత్వం నూతన రాష్ట్రనిర్మాణానికి వీలు కలిగిస్తూ పార్లమెంటులో ఒకబిల్లు ప్రవేశపెట్టుతుంది. ఈ బిల్లును పార్లమెంటు ఆమోదించిన తర్వాత నూతన రాష్ట్రం అవతరిస్తుంది.

ఈ సెంబరుమాసంలో ఏ పద్ధతిగా రాష్ట్రనిర్మాణం జరిగినా, ముందు కొన్ని ప్రధానమైన అంశములమీద సర్వ సమ్మతి సంగీకార యోగ్యమైన నిర్ణయాలు జరగవలసి ఉంటుంది గవర్నరు జనరలు ఉత్తర్వు

(2వ పేజీ చూడుడు)

## "మమ్ము సంప్రదించనిది ఆంధ్రరాష్ట్రం ఆర్డరుజారీ కాదు"

### మంత్రి భక్తవత్సలంగారి ప్రకటన

మద్రాసు, నవంబరు 25: మదరాసు ప్రచురణశాఖమంత్రి గౌ॥ ఎం. భక్తవత్సలంగారు నేడు పత్రికా ప్రతినిధులతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సందర్భమున కేంద్ర ప్రభుత్వంనుండి తమకు యింతవరకు ఎట్టి ఉత్తరువు రాలేదనిరి ఉత్తరువు జారీఅగు లోపున ఆంధ్రసుం తమిళులమధ్య పరిష్కారంకావలసినసమస్యలు కొన్ని ఉన్నవనియు, అవి తేలందే ఉత్తరువు జారీకాదనియు, ఉత్తరువు జారీ అయ్యేలోపున మదరాసు ప్రభుత్వ అభిప్రాయం కేంద్ర ప్రభుత్వంవారు గైకొందురనియు, అందుకుగాను సందేశముఒకటి రెండురోజులలో రాగలదనియు చెప్పిరి

## రాష్ట్రాలకు కొత్త పేర్లు

### గవర్నర్ జనరల్‌కు ప్రత్యేకాధికారం

### ఇండియా ప్రభుత్వచట్టంలోని 290 సెక్షన్ సవరణ బిల్లుకు పరిషత్తు ఆమోదం

న్యూఢిల్లీ, నవంబర్ 25: నేడు రాజ్యాంగ పరిషత్తులో కొద్ది చర్చ జరిగినమీదట, 1935 ప్రభుత్వ చట్టాన్ని సవరించడానికి డా॥ అంబేద్కర్ ప్రవేశపెట్టిన బిల్లు ఆమోదించబడింది ఈ బిల్లు నవంబరు 26 నండి అమలులోకి వస్తుంది దీని సహాయంతో గవర్నరు జనరలు ఏరాష్ట్రం పేరుగాని మార్చవచ్చును.

చర్చ సమయంలో సభ్యుల మధ్య రాష్ట్ర తత్వాలమీద వాదోపవాదాలు జరిగినవి యు. పి వారు ఇండియాకు పనికి వచ్చే పేర్లు తమ స్వంతం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారని ఆర్. కె. సిధ్వా చేసిన ఆరోపణను ఖండిస్తూ మోహన్‌లాల్ గౌతమ్ మిగిలిన రాష్ట్రాలన్నిటికీ రాష్ట్రతత్వం ఉన్నదని ఆరోపించగా సభికులు "లేదు లేదు" అని కేకలు వేశారు.

లోకనాథ్ మిశ్రా (ఒరిస్సా) మాట్లాడుతూ తమ రాష్ట్రానికి పేరు ఉత్కళం అని మార్చాలనీ, ఇదివరకే ఉత్కళ్ విశ్వవిద్యాలయానికీ, కాంగ్రెసు రాష్ట్రానికి చేరిఉన్నదని, రవీంద్రనాథుడు "జనగణమన" గీతంలో తమరాష్ట్రాన్ని ఉత్కళ అన్నారని చెప్పారు.

మోహన్‌లాల్ గౌతమ్ ఇంకా మాట్లాడుతూ, ఒకరు అభ్యంతరపెట్టే పేర్లు తమ కవసరంలేదని, యు. పి. నవాబులకు స్వంతం ... రాదనీ, రాష్ట్రానికిపెట్టే పేరు ఉచితంగా ఉండాలని, కాంగ్రెసు రాష్ట్రానికి లేనిది ఒక యు. పి మాత్రమేనని అనగా సభ్యులు సంతోషం ... ఆ ఎవాడు ఆయన మరోసారి "మీరు ఇతర రాష్ట్రాలవారిని సహించరు" అనగా "లేదు, లేదు" అని కేకలువేశారు. "మేము సవాలుచేస్తున్నాము, 1919 లగాయతు మీ మంత్రివర్గంలో ... ... రెండు మంది ఉన్నారు" అని ఆయన అడిగారు.

అన్యాయాలు ఇప్పుడు మనం సరిదిద్దుకోవడం చేద సహించారు అనీ చిన్నవి

ఎ ఎ పి పాటస్కర్ (బొంబాయి) ఆర్. ఆ. సిన్హా (స. పి. బిహారు) రెండు సవరణలు ప్రతిపాదించారు ఈ రెండు సవరణలుకూడా అంగీకారంపొందవలసిదని చెప్పారు

## "చెప్పవలసినది ఉంటేనే మాట్లాడండి"

### రాజ్యాంగపరిషత్తు సభ్యులకు అధ్యక్షుని హెచ్చరిక

న్యూఢిల్లీ, నవంబరు 25: నేడు రాజ్యాంగ పరిషత్తులో రాజ్యాంగం మీద చర్చ ఆరంభం కాకపూర్వం అధ్యక్షుడు డాక్టరు రాజేంద్రప్రసాదు, చాలా క్లుప్తంగా మాటలాడి సాధ్యమైనంతమందికి మాట్లాడే అవకాశం కల్పించమని సభ్యులకు హెచ్చరించారు

తాను అందరి ప్రసంగాలనూ శ్రద్ధతో ఆలకించాననీ, అంతకన్న కొత్తగా సభ్యులు చెప్పగలది ఏమీ వుండడానికి అవకాశం లేదనీ, రాజ్యాంగం అమలు జరిగిన అనంతరం అందులో తాము కూడా పాల్గొన్నామనిపించుకోవడానికై సభ్యులు మాట్లాడుతున్నట్లు తనకు తోస్తున్నదనీ, అందుచేత సభ్యులు మాట్లాడడానికేమైనా ఉంటేనే మాట్లాడాలనీ, చాలా సంగ్రహంగా మాట్లాడాలనీ ఆయన అన్నాడు.

## స్టెర్లింగ్ నిల్వల పై కేంద్ర శాసనసభ చర్చ

న్యూఢిల్లీ, నవంబర్ 24: స్టెర్లింగ్ ఋణ పరిష్కార ఒప్పందాన్ని గురించి భారత అధినివేశ శాసనసభ నవంబరు 29వ తేదీన చర్చిస్తుంది.

## తుపాను పీడితప్రాంతంలో దాళ్వపంటకు సౌకర్యం

### ప. గో. జిల్లాకలెక్టరు ఉత్తరువు

ఏలూరు, నవంబరు 22: గోదావరి పశ్చిమ జిల్లాలోని తెంపపంట కోసే ... తుపాను ... కలెక్టరు ... ప్రత్యేకంగా ... దాళ్వ పంటకు ... పరిస్థితులకు ... నీటిని ... ఉత్తర్వు జారీ చేశారు.

(స్వ. వి.)

## అమెరికా భారత దేశాల సన్నిహిత సంబంధాలు

### ప్రెసిడెంట్ ట్రూమన్, ప్రధాని నెహ్రూ పరస్పర అభినందన లేఖలు

వాషింగ్‌టన్, నవంబర్ 24: తాను అమెరికాకు రావటంవల్ల అమెరికా భారత దేశముల మైత్రి మరింత సన్నిహితం కాగలదని విశ్వసించుతున్నానని ప్రధాని నెహ్రూ తనకు వ్రాసిన లేఖను అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఈవేళ ప్రకటించారు.

అమెరికాలో నాకు లభించిన ఆతిథ్యానికి నేనేకాక, నా ప్రజలంతాకూడా చాలా సంతోషించగలరు అని ఆ లేఖలో నెహ్రూ తెలియజేశారు

ట్రూమన్‌సమాధానంతో సహా, ఈలేఖను, వైట్‌హౌస్ నుంచి ఈవేళ ప్రకటించారు.

ఈ లేఖను ప్రధాని నెహ్రూ నవంబర్ 6వ తేదిన న్యూయార్కు నుంచి వ్రాశారు.

'ప్రియమైన అధ్యక్షులకు, రేపటిదినం నేను, అమెరికావిడచి మా దేశం తిరిగివెళ్ళటానికి ప్రయాణ మౌతున్నాను నేనుమీ అతిథిగా, తమరు నాకిచ్చిన ఆతిథ్యానికి నాపట్లచూపిన ప్రేమ వాత్సల్యాలకు, తమకు కృతజ్ఞత తెలుపవలసివున్నది. అద్భుతంగా వున్న మీ దేశంలో నేను మూడు వారాలన్నరపాటు హాయిగా గడిపాను ఇక్కడ అనేక మహోత్తరమైన విషయాలు విని చూచి ఆనందించితిని.

అన్నిటికీమించి, నా పర్యటన సందర్భంలో ఆయా ప్రాంతాలలోని వివిధ వర్గాల ప్రజలు నాపట్లనూ, నాదేశంపట్లనూ చూపిన సౌహార్దానికి నేనెంతో ఆనందించుచున్నాను. నాకు మల్లే, నా ప్రజలుకూడా ఇందుకు చాలా సంతోషించగలరు ఈ నా పర్యటన అమెరికా భారత దేశాలమధ్య ఉన్న స్నేహసంబంధాలను సన్నిహితం కావటానికి దోహదం కాగలదని నమ్ముతున్నాను

రాజకీయాలు, మీకూ మీ ప్రభుత్వానికీ నా కృతజ్ఞతలు ... నా పర్యటనను ... మీ దేశ ... ముఖ్యంగా ... లైన అనుభవాలను నేను కలకాలం జ్ఞప్తి వుంచుకొంటాను అభివందనములు

—జవహర్‌లాల్ నెహ్రూ

నవంబర్ 23వ తేదీన అధ్యక్షుడు ట్రూమన్ ఈ లేఖకు ఇలా సమాధానమిచ్చారు

ప్రియమైన ప్రధానికి! తమ లేఖను అందుకొని చాలా ఆనందించాను. మీ బొమ్మకూడా చేరింది అమెరికాకు తమరాక నాకేకాక నా ప్రజలందరకూ చాలా ఆనందకరంగా వున్నది సభాభివందనములు

—హారీయస్. ట్రూమన్

## "జర్మనీలో యంత్రోద్వాసన వుండదు": పశ్చిమరాజ్యాల ప్రకటన

బాన్, నవంబరు 24: ఇరవై జర్మన్ ఫ్యాక్టరీలలో యంత్రోద్వాసన వుండదని నేడు పశ్చిమ రాజ్యాలవారు ప్రకటించారు.

ఇంతేకాక, జర్మనీకి స్వంతంగా వర్తక నౌకలను నిర్మించుకునే స్వాతంత్ర్యం గూడా లభించింది.

ఇందుకుబదులుగా పశ్చిమజర్మని ప్రభుత్వం పశ్చిమరాజ్యాలవారికి వారు అమలు జరుపుతూవున్న సైనికసన్యాస విధానంలో తోడ్పడడానికి అంగీకరించింది

అంతేకాకుండా రూర్ మైదానంమీద ఆధిపత్యంవహిస్తున్న ఆరురాజ్యాలతో తానుకూడా చేయికలపగలనని జర్మనీ హామీయిచ్చింది.

ఏవంవిధమైన ఈ ఒడంబడికమీద నేటి మధ్యాహ్నమే సంతకాలు జరిగాయి. దీనికి అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు హైకమిషనర్లు, పశ్చిమజర్మనీ ఛాన్సలర్ అడెనోయర్ సంతకాలు చేశారు.

ఈఒడంబడిక ననుసరించి మిత్రరాజ్యాలు జాబు 11 ఉక్కు కర్మాగారాలను

7 ఉక్కు కర్మాగారాలను ఉద్వాసన విధానానికి గురికాకుండా రక్షించారు. ఇందులో హాంబర్గ్‌లోవున్న థిస్సెన్ కర్మాగారాలుగూడా వున్నాయి.

ఓడల నిర్మాణంవిషయంలో మాత్రం ఒకవిధమైన ఆంక్షలు వుంచారుగాని, ఆ ఓడలను మాత్రం ఈ హద్దుమించి నిర్మించవచ్చునని అంగీకరించారు పశ్చిమజర్మనీవారు వెంటనే ఓడలనిర్మాణానికి పూనుకోగలరని తెలుస్తున్నది

పశ్చిమజర్మనీతో ఈ ఒప్పందాన్ని ఎందుకుచేసుకొన్నది వివరిస్తూ "పశ్చిమజర్మనీ ఫెడరల్ రిపబ్లిక్‌ని యూరోపు రాజ్యకూటమిలో శాంతిని ఆకాంక్షించే రాజ్యంగా చేర్చాలన్నదే మా ఆశయం. అందువల్ల దానికి అంతర్జాతీయరంగంలో పనిచేస్తున్న వివిధవ్యవస్థల్లోను సభ్యత్వం లభించేటట్లు చూడగలమని మేము భావిస్తున్నాము దీనితోపాటు ఇతరదేశాలతో రాజకీయ వర్తక వాణిజ్యవిషయాలలో సంబంధాలు ఏర్పరచుకోడానికి అవకాశం కలిగించాలనే ఆశయం అని పశ్చిమరాజ్యాలవారు వివరించారు.

## పాకిస్థాన్ జనపనార మార్కెట్‌లో తీవ్ర ప్రతిష్ఠంభన

### ఇండియన్ కరెన్సీకి విపరీతమైన గిరాకీ

న్యూఢిల్లీ, నవంబరు 24: పాకిస్థాన్‌లో ముడి జనపనార ధర తీవ్రంగా పడిపోవడం మూలంగా, అక్కడ భారత కరెన్సీకి విపరీతమైన గిరాకీ వచ్చింది ఈ కరెన్సీని తగినంత సంపాదించుకొని, వ్యాపార పరిస్థితిని గడిచి గట్టెక్కటకు అన్ని రకాల మార్గాలు అనుసరింప బడుతున్నవి

ఇటీవల జనపనార క్రయ విక్రయాలకు పాకిస్థాన్ ప్రభుత్వం నియమించిన బోర్డువారు, ... జనపనార నిల్వలను ... ... ... ... ... మార్కెట్‌లో తీవ్ర ప్రతిష్ఠంభన ఏర్పడిందని తెలుస్తున్నది

పాకిస్థాన్‌లో భారత కరెన్సీకి గిరాకీ ...

చేసుకొంటూ ఉండడం ముఖ్య కారణాలని తెలుస్తున్నది.

ప్రస్తుతానికి విలువ తగ్గింపుకు పూర్వం పాకిస్థాన్ వ్యాపారులు లక్షలమంది భారతదేశంనుంచి పత్తి, నూలు, వస్త్రములు కొనుగోలుకు కంట్రాక్టులు వ్రాసుకొన్నారని, యీ కంట్రాక్టులు నెరవేర్చుటకు ...

(2వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ సప్తమి

1949 సం॥ నవం॥ 26 శనివారం

శు॥ సప్తమి రా 2-51 ధని తె 5-43 వర్జ్యం ప 8-32 ల 10-13 కు.

శు॥ అష్టమి నవం॥ 27 ఆదివారం

ఆ॥ అష్టమి తె 4-27 శత 24-0 వర్జ్యం ప 1-36 ల 3-20 కు.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ సప్తమి

శనివారం


# హైదరాబాద్ నవాబు ఫర్మానా

హైదరాబాద్ సంస్థానమునందు ప్రబలిన దుష్టశక్తుల సంహరించి, సంస్థాన పరివ్యాప్తమై యున్న దుష్పరిపాలనమును తుద ముట్టించి ప్రభుత్వ వ్యవహారములందు ప్రజలకు భాగస్వామ్యము కల్పించుటకు దాదాపు సంవత్సరము క్రితము భారతప్రభుత్వము జరిపిన పోలీసుచర్య లక్ష్యము మొన్నటి దినము హైదరాబాదు నవాబుగారు తమ సంస్థానమును భారత సమితిలో చేర్చుచు, రాజ్యాంగ పరిషత్తు నేడామోదించు భారత రిపబ్లిక్ రాజ్యాంగము తమ సంస్థానమునకు వర్తింపజేయుచు చేసిన ఫర్మానాతో పూర్తిగ సిద్ధించినదని చెప్పవచ్చును. ఒక్క హైదరాబాదుసంస్థానముతప్ప భారతప్రభుత్వమునకు అధికారము దఖలు పరచినట్టియు, భారత ప్రభుత్వముతో యథాతథపు ఒడంబడికలు చేసుకొనినట్టియు సంస్థానములన్నియు గతమాసము 15 వ తేదీ నాటికే భారత సమితి అంతర్భాగము లైనవి. తత్ఫలితముగ రాజ్యాంగ పరిషత్తు నూతన రాజ్యాంగము భారత రాష్ట్రములకు వర్తించినట్లే భారత సంస్థానములకును వర్తించునట్లు నిర్ణయము చేసెను. ఏ సంస్థానము ఇందుకు భిన్నమైన మార్గమును అనుసరించుట జనవరి 26 వ తేదీ అనంతరము సాధ్యముగాదు. ఇదిః పూర్వము జరిగియుండిన ఒప్పందములు, ఒడంబడికలు, చట్టబద్ధమగుటకు అన్యమార్గము లేదు. కనుకనే హైదరాబాద్ నవాబుగారు 1947 ఆగస్టు 15 అనంతరము ప్రవర్తించినట్లు గాక, ఇపుడు వాస్తవికదృష్టితో, కాలానుగుణ్యముగ వ్యవహరింపవలసి వచ్చెను. అధికార దఖలు పత్రముపై సంతకము చేయుటతో సంస్థానము భారత సమితియందు చేరిపోయినది. ఇందువలన హైదరాబాద్ సమస్యల పరిష్కారము సుకరమైనది. రాజ్యాంగ పరిషత్తు ఏర్పడి, సంస్థానమునకు నేరొక రాజ్యాంగమును తయారు చేయవలసిన యవసరము ఇక లేదు. నవాబుగారి నిశ్చయమును రాజ్యాంగ పరిషత్తు అంగీకరించవలసియున్నను, అట్టి ఆమోదమునకు పూర్వము జరుగవలసిన కార్యక్రమంతయు నైజాం ఫర్మానాను అనుసరించి జరుగ వీలగును. ఈ ఫర్మానాను పురస్కరించుకొని ప్రస్తుతము భిన్నముగ నున్న సంస్థాన ఆర్థిక వ్యవస్థను భారత దేశ ఆర్థిక వ్యవస్థలో లీనము చేయుటకు వీలుగ సంస్కరింపవచ్చును. ఈ విధముగ జనవరి 26 వ తేదీన స్వతంత్ర భారత రిపబ్లిక్ అవతరణతోబాటు ప్రజాస్వామిక హైదరాబాదు సంస్థానము కూడ అవతరింప గలదు. అంతియే గాక, హైదరాబాద్ సంస్థానము ముందుగనే భారత సమితియందు చేరుటవలన మున్ముందు, రాజ్యాంగ పరిషత్తు నిర్ణయము ప్రకారము సంస్థానమును వివిధ భాషాప్రాంతములుగ విభజించి సంశ్లిష్ట భాషా రాష్ట్రములతో చేర్చివేయుట సులభమగును.

గత సెప్టెంబరు 18 వ తేదీన పోలీసుచర్య పరిసమాప్తమైనప్పటి నుండియు సంస్థాన పరిపాలన మిలిటరీ గవర్నరు పరముగ నుండెను. మిలిటరీ గవర్నరు పదవిని రద్దుచేసి భారతప్రభుత్వము పౌర పరిపాలనాధికారిగ శ్రీ యం. కె. వెల్లోడి గారిని నియమించి యుండెను. నవాబుగారు గురువారము జారీ చేసిన ఫర్మానా ఈ మార్పుకు అనుగుణముగ నున్నది. ఆ ఫర్మానాయందు నవాబుగారు పేర్కొనినట్లు సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయములలో హైదరాబాదు సంస్థానమునకు భారత దేశముతో సన్నిహిత సంబంధములు గలవు. ఈ రీతివిషయమును 1947 ఆగస్టు 15 నాడైనను, అథమము 1948 సెప్టెంబరు 13 కు పూర్వమైనను గ్రహించియుండిన, హైదరాబాద్ సంస్థానముకూడ ఈసరికి ఇతర సంస్థానముల స్థాయిని పొంది యుండెడిది. భారతప్రభుత్వమునకు కొక సంకటస్థితి నివార్యమైయుండెడిది. సంస్థాన ప్రజలు కష్ట, నష్టములను అనుభవింపవలసిన పరిస్థితులు ఏర్పడియుండెడివి కావు. సంస్థానమున కమ్యూనిస్టుచర్యలు ప్రబలుటకు అవకాశము ఉండెడిదిగాదు.

గతమునం దెన్ని విషాదసంఘటనలు జరిగినను, తుదకు అన్ని వ్యవహారములు సవ్యముగ, సంస్థాన ప్రజల క్షేమాభివృద్ధి దృష్ట్యా పరిష్కారమగుట శుభసూచకము. ఇట్టి నిర్ణయమునకు వచ్చిన నవాబుగారు అభినందనీయులు.

# జరుసలెం భవిష్యత్తు

## సమితిరాజకీయ సంఘంలో చర్చ

లేక్‌సక్సెస్, నవంబరు 24: జరూసలెంను అంతర్జాతీయ నగరంగా చేయుటకు, ఐక్యరాజ్యసమితి తాలూకు ప్రత్యేక రాజకీయసంఘం యివ్వాళ ఒకప్లానును చర్చించడం మొదలు పెట్టింది.

ఈ ప్లానును ఐక్యరాజ్యసమితి పాలస్తీనా సంఘం ప్రతిపాదించింది. దీని ప్రకారం జరూసలెం, రెండు ప్రాంతాలుగా అనగా అరబ్ యూదు నగరాలుగా విభాగింపబడుతుంది. వీటిపై సమితి కమిషనర్ ఒకడు నియోగింపబడతాడు. ఉభయ నగరాలలోనూ, పుణ్యస్థలాలను యథేచ్ఛగా సందర్శించుటకు, యీయన తగిన రక్షణావకాశాలను కల్పిస్తాడు. ఈయన ఉద్యోగకాలపరిమితి నిర్ణీతం. నగరాన్ని సైనిక స్థావరాలు లేకుండా చేసి ప్రాంతంగా యేర్పాటుచేసి, అందు నివసించే వివిధ జాతుల హక్కులను రక్షిస్తూ ఉంటాడు.

14 మంది సభ్యులతో ఒక కౌన్సిల్ యేర్పాటు చేయబడుతుంది ఈ కౌన్సిల్ ప్రాతినిధ్యం, అరబ్ యూదు పక్షాలవు సమంగా ఉంటుంది. ఈ కౌన్సిల్ నగర పరిపాలనను నిర్వహిస్తూంటుంది.

ఈ ప్లానును అమెరికా ప్రతినిధి బలపర్చాడు. ఆస్ట్రేలియా ప్రతినిధి, జరూసలెం, బెత్లేహేంలపై, అంతర్జాతీయ పరిపాలన ఉండాలనేయుద్దేశాన్ని బలపరచాడని అన్నాడు. అంతటితో రాజకీయ సంఘ చర్చ వాయిదా పడింది.

# ఇండోచైనాలో ఫ్రెంచి సైనికపరిస్థితి

## క్లిష్టంగా ఉన్నట్లు బ్రిటిష్ అధికారి ప్రకటన

సింగపూర్, నవంబర్ 24: "ఇండోచైనాలో సైనిక పరిస్థితి ఇంకా క్లిష్టంగానే ఉన్నది. అభివృద్ధి చాలమందంగా ఉంటుందని చెప్పకతప్పదు." అని ఆగ్నేయాసియాలో బ్రిటిష్ కమిషనర్ జనరల్ మాల్కం మాక్డొనాల్డు నేడిక్కడ వెల్లడించాడు.

ఈయన ఇండోచైనాలో పర్యటనను ముగించుకుని నిన్నరాత్రే ఇక్కడకు వచ్చాడు.

త్వరలోనే బావ్‌దాయ్ ప్రభుత్వానికి ముఖ్యాధికారాలు ఇవ్వబడతవని ఆయన వెల్లడించాడు.

"ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు బావ్‌దాయ్‌ని సమర్థించేట్లు ప్రోత్సహించే ముఖ్యకారణం బావ్‌దాయ్, ఫ్రెంచివారితో సమాధానపడి శాంతిని చేకూర్చే అవకాశం కాంబోడియాకు స్వాతంత్ర్యం ఇస్తూ ఇటీవల పారిస్‌లో ఒడంబడిక జరిగిన తర్వాత అనేకమంది ప్రతిఘటనోద్యమ కారులు ప్రభుత్వంతో సహకరిస్తున్నారు. వియెట్మిన్ (హోచిమిన్ ప్రభుత్వం) కింద ఉన్న ప్రాంతాలుకూడా బావ్‌దాయ్ ప్రభుత్వాన్నే సమర్థిస్తున్నవి" అని మాక్డొనాల్డు అన్నాడు.

# "టిబెట్‌ను చిటికెలో కొట్టివేస్తాం"

## చైనాకమ్యూనిస్టునాయకుని అహం

హాంకాంగు, నవంబరు 24: కమ్యూనిస్టు చైనాలోని పెకింగు రేడియో నేడిట్లు ప్రకటించెను: టిబెట్టులో బుద్ధదేవాంశసంభూతుడైన 12 సం॥ వయస్సుగల పంచన్‌లామాగారు టిబెట్టు రాజ్యమును విద్రోహవర్గముల అధికారములోనుండి తప్పించి టిబెట్టు ప్రజలకు విమోచన కలుగజేయవలసినదిగా చైనాలోని కమ్యూనిస్టుల కొక విజ్ఞాపన చేసెను. చైనాలోని కమ్యూనిస్టు నాయకులగు మావోసేటంగుగారును, జనరలు చూటేగారును, చైనాకు లోబడి స్వపరిపాలనాధికారము ననుభవించుచున్న టిబెట్టును కమ్యూనిస్టుసేన ఆక్రమించుట కొలదికాలములోనే జరుగునని చెప్పిరి. కమ్యూనిస్టు ప్రభుత్వము స్నా కమ్యూనిస్టు సేనయున్న టిబెట్టులో నెలకొల్పబడుటవల్ల టిబెట్టుప్రజల కోరిక లీడేరగలవనియే తాము నమ్ముచున్నామనిరి.

ఈసంవత్సరం వేసంగిలో చైనాలోని చింగ్‌హాయి రాష్ట్రమునందు బంగారు గోపురములగల కుంబన్ ఆలయములో టిబెట్టుకు మఠాధిపతిగా పంచన్‌లామా ప్రతిష్ఠింపబడెను. టిబెట్టులో ఇతనికి పోటీగా ఉన్న దలాయిలామా టిబెట్టు రాజ్యాధిపత్యంకూడా గత 25 సం॥లుగా టిబెట్టుపు ఆధిపత్యం వహించియున్నారు. ఈ దలాయిలామాచే పంచన్‌లామా టిబెట్టునుండి తరిమివేయబడెను. పంచన్‌లామా ఇప్పుడు చింఘాయిలో ఉన్నాడు. చింఘాయి గత సెప్టెంబరు మాసంలో చైనా కమ్యూనిస్టులచే ఆక్రమింపబడెను. చింఘాయినుండి పెకింగులో కమ్యూనిస్టు అధికారులకు పంచన్‌లామా పైరీతిగా విన్నవించెను. పంచన్‌లామా టిబెట్టునుండి పారిపోయి చింఘాయికి వచ్చెనని ఆజవరలో చైనా జాతీయ పక్ష ప్రభుత్వము చెప్పుచుండెను. కాని కమ్యూనిస్టుల ఆక్రమణలోనికి చింఘాయ్ వచ్చువరకు పంచన్‌లామా అచటనే యుండెను.

దలాయిలామా ఇప్పుడు టిబెట్టును పాలించుచున్నాడు. వయస్సు 12 సం॥లు. అందువల్ల ఇతని తరపున ఒక రీజెంటు ప్రభుత్వాధికారంచలాయించుచున్నాడు. గతవేసంగిలో చైనాజాతీయపక్ష ప్రభుత్వము తాలూకు ఒకరాయబారవర్గమును దలాయి లామా టిబెట్టునుంచి వెడలగొట్టెను. కాని అతడు కమ్యూనిస్టులను కూడా ప్రతిఘటించును.

# అమెరికాలో ప్రొఫెసరు బినయసర్కార్ మృతి

వాషింగ్టన్, నవంబరు 24: ఆర్థికసాంఘిక శాస్త్రాచార్యుడు, ప్రొఫెసర్ బినయ్ సర్కార్, ఈ వేళ ఇక్కడ హఠాత్తుగా హృద్రోగంవల్ల మరణించారు. ఈయన కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆర్థిక, సాంఘిక శాస్త్రాచార్యులుగా ఉండేవారు.

ఈయన గత ఫిబ్రవరిలో అమెరికాలో ఉపన్యాసాలివ్వడానికి వచ్చారు. ఈ ఉపన్యాసాలు వాటుముల్ అంతర్జాతీయ విద్యానిధి ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడినవని తెలుస్తున్నది.

ఈ ప్రొఫెసరు భారతదేశంలో అంతటా పేరున్నవారు.

# భారతపరిశ్రమాభివృద్ధి

## ఇతరదేశాల పెట్టుబడి

## ఇంతవరకు 37 దరఖాస్తులకు భారతప్రభుత్వామోదం

న్యూఢిల్లీ, నవంబరు 24: ఇండియన్ పెట్టుబడితో వాటాలు కలిపి దేశంలో పరిశ్రమలను నెలకొల్పే ఉద్దేశంతో విదేశీ పెట్టుబడిదార్లు భారతప్రభుత్వానికి ఎక్కువగా అర్జీలు పంపుతున్నారు.

గడచిన ఏప్రిల్‌లో పండిట్ నెహ్రూ పార్లమెంటులో భారత పారిశ్రామిక విధానాన్నిగూర్చి విస్పష్ట ప్రకటన చేసిన అనంతరం విదేశీ పెట్టుబడిదార్ల దగ్గర నుంచి 59 అర్జీలు వచ్చాయి.

ఇందులో 37 అర్జీలను ప్రభుత్వం ఆమోదించింది. ఇంతకుపూర్వం ఇటువంటి అప్లికేషన్లనే ఒక 29 టిని అంగీకరించింది.

ఈ 66 అప్లికేషన్లవల్ల ఏర్పడే పెట్టుబడి మొత్తం 23 కోట్ల రూపాయలలోను విదేశీ పెట్టుబడి 6.2 కోట్లు మాత్రమే.

ఈ అప్లికేషన్లలో యెక్కువ బ్రిటన్ నుంచి వచ్చాయి. 10% మాత్రం డాలర్ ప్రాంతాలనుంచి వచ్చాయి.

మోటార్లు, కెమికల్సు, మందులు, మడిఫిలిం, జనరల్ ఇంజనీరింగు, తోళ్లు, కాగితం, టెక్స్టయిలు యంత్రాలు, అచ్చుసిరా మొదలైన పరిశ్రమలను నెలకొల్పాలని వీరంతా ఉద్దేశిస్తున్నారు.

అదీకాకుండా ఇప్పుడు విదేశాలవాళ్ళకు భారతదేశం విదేశీ పెట్టుబడి విషయంలో అనుసరిస్తున్న విధానం బాగా అవగతమైనట్లు గోచరిస్తున్నది. ప్రతివారం ఏదో ఒక విదేశీవ్యవస్థ భారత ప్రభుత్వం తో సంప్రదింపులు జరుపుతూవున్నది.

కాగా ఇప్పుడు వస్తూవున్న విదేశీ పెట్టుబడిదారులఅర్జీలను గుర్తించడంలో వారు పెట్టదలచుకుంటున్న పరిశ్రమలకు ఇండియా పెట్టుబడిని ఎక్కువ గ్రహించాలని, భారతీయులకు సాంకేతిక విజ్ఞానంలో నైపుణ్యం చేకూర్చే ఏర్పాటులు చెయ్యాలని ప్రభుత్వం షరతు పెడుతున్నది. అంతే కాకుండా ఒక పరిశ్రమను ఇండియాలో నెలకొల్పడానికి అనుమతిస్తున్నదంటే, ఆ పరిశ్రమకు ముఖ్యమైనదన్నీ ఇండియాకు శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని చేకూర్చేదన్న అయితేనే ప్రభుత్వం విచారిస్తున్నది.

ఇప్పుడు ఇండియాలో రెండు పెద్ద ఉక్కు కర్మాగారాలను నెలకొల్పే విషయమై అమెరికన్ పెట్టుబడి దార్లతో సంభాషణలు నలుగుతున్నాయి. అసలు ఈ కర్మాగారాలను ప్రభుత్వమే స్వయంగా నెలకొల్పాలను కున్నది గాని, రూపాయి మారకం రేటు తగ్గించడం వల్ల వచ్చిన ఇబ్బందులను పురస్కరించుకొని ఇప్పుడు విదేశీ పెట్టుబడికి కూడా స్థానం ఇవ్వాలని ఆలోచిస్తున్నది.

# నిర్బంధ పొదుపు విధానము

## అమలు జరుపుటకు ప్రభుత్వ నిర్ణయం

మద్రాసు, నవంబరు 24: ఇండియా ప్రభుత్వము సిఫార్సు కనుగుణ్యముగా నెలకు రు 251/- లకు మించి జీతము గల ప్రభుత్వోద్యోగులకు నిర్బంధ పొదుపు విధానమును వర్తింపజేయుటకు మద్రాసు ప్రభుత్వము నిశ్చయించెను.

ఇటీవల ఇండియా ప్రభుత్వము రు 2750 లకు మించిన జీతములుతీసుకొను ఉద్యోగుల జీతములను తగ్గించవలెనని ప్రభుత్వములుకోరెను. మద్రాసు ప్రభుత్వము అంగీకరించి ఆ రీతిగా ప్రకటించియుండెను. పొదుపువిధానముకూడ అమలు జరుపవలెనని ఇండియా ప్రభుత్వము కోరియున్నది. ఇప్పుడు మద్రాసు ప్రభుత్వము రు 251 లకు మించిన జీతములు గలవారికి నిర్బంధ పొదుపు విధానమును వర్తింపజేయుటకు నిశ్చయించి ప్రకటించియున్నది. ఈ నిర్బంధ పొదుపు విధానము జీతములు తగ్గించబడిన పెద్ద జీతము ఉద్యోగులకుకూడ వర్తించును.

ఈ విధానము 1949 డిసెంబరు 1 నుండి 1952 మార్చి 1 వరకు అమలులో వుంటుంది.

ఈ కాలములో 250 లకు మించి జీతము తీసుకొను ప్రతి ఉద్యోగి ఈ దిగువ రేట్లు ప్రకారము జనరల్ ప్రావిడెంటు ఫండుకుగాని కంట్రిబ్యూటరీ ప్రావిడెంటు ఫండుకుగాని చెల్లించవచ్చును.

రు 251 నుండి రు 500 వరకు అణన్నర
రు 501 నుండి రు 1000 ,, 2 అణాలు
రు 1001 నుండి రు 2000 ,, 2½ అణాలు
రు 2001 నుండి రు 3000 ,, 3 అణాలు
రు 3001 నుండి ఆ పైన అంతకు మైనస్తికాలు

# నైర్ఋతి ఆఫ్రికా భవిష్యత్తు: ఉపసంఘంలో పని చేయడానికి దక్షిణాఫ్రికా ప్రతినిధుల నిరాకరణ

లేక్‌సక్సెస్, నవంబర్ 24: నైర్ఋతి ఆఫ్రికా జాతులకు కొందరు ప్రాతినిధ్యం వహించే విషయం పరిశీలించడానికి ఐక్యరాజ్యసమితి ఒక ఉపసంఘం నియమించింది. దక్షిణాఫ్రికా ఈ ఉపసంఘంలో పని చెయ్యడానికి నిరాకరించింది. మొదటి ప్రపంచయుద్ధం అయినతరువాత జర్మనీకి కాలనీగా ఉండే నైర్ఋతి ఆఫ్రికాపై దక్షిణాఫ్రికాకు ధర్మకర్తృత్వం ఏర్పరిచారు.

ఈ కమిటీలో పని చెయ్యడానికి ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, గ్రీసులుకూడా నిరాకరించాయి. అయితే కొలంబియా, గ్వాటిమాలా, ఇండియా, పోలండు, ఈజిప్టు, డొమినికన్ రిపబ్లిక్ అమెరికాలు, ఇందులో సభ్యత్వం వెరపడానికి అంగీకరించాయి.

ఈ ఉపసంఘంలో నైర్ఋతి ఆఫ్రికా జాతులకు ప్రాతినిధ్యం వహించడం విషయంలో చర్చ ప్రారంభమైనప్పుడు పాకిస్థాన్ ప్రతినిధి జి. కె. మహబూబ్ ఇలాగ అన్నారు. "ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం ఉన్న దేశం ఐక్యరాజ్యసమితి ఆదేశం ఉల్లంఘించడం అప్పుడే నాలుగుసార్లు జరిగింది. ఐక్యరాజ్యసమితి తన గౌరవం నిలబెట్టుకోవడానికి గట్టిగా నిలబడాలి. దక్షిణాఫ్రికాకు నైర్ఋతి ఆఫ్రికాపై ధర్మకర్తృత్వం నెరపడానికే అధికారం ఉన్నది. దక్షిణాఫ్రికా నైర్ఋతి ఆఫ్రికాపై ధర్మకర్తృత్వం నెరపడానికి బదులు, ఆ దేశాన్ని చాలావరకు కబళించి వేసింది. ఐక్యరాజ్యసమితికి ఈ విషయంలో తాను ఇచ్చిన వాగ్దానానికి వ్యతిరేకంగా ప్రవర్తించింది. ఇక దక్షిణాఫ్రికా నైర్ఋతి ఆఫ్రికాలోని యూరోపియేతర భిన్న జాతులనన్నింటినీ అణగదొక్కి వేస్తుందనడంలో సందేహం ఏమీలేదు."

ఆపైన ఆంగ్ల ప్రతినిధి డెరెన్సు పాన్ మాట్లాడుతూ, దక్షిణాఫ్రికా నైర్ఋతి ఆఫ్రికా విషయంలో ఐక్యరాజ్యసమితికి తప్పకుండా నివేదిక పంపాలని ఎక్కడా లేదనీ- అందుచేత దక్షిణాఫ్రికా చేసిన దానిలో తప్పేమీలేదనీ, అయితే ఈ విషయంలో అంతర్జాతీయ న్యాయస్థాన విచారణకు పంపడం మంచిదనీ అన్నారు.

భారత ప్రతినిధి బి. శివరావు ఈ విషయము అంతర్జాతీయ న్యాయస్థానానికి పంపడం సముచితమని అన్నారు.

## నైరుతి ఆఫ్రికా ప్రజాభిప్రాయం

### వినడానికి అంగీకారం

### భారత ప్రతినిధి ప్రముఖ పాత్ర

లేక్‌సక్సెస్, నవంబరు 24: నైరుతి ఆఫ్రికాజాతీయప్రతినిధుల అభిప్రాయాలు వినటానికి ఐక్యరాజ్యసమితి యీవేళ అంగీకరించింది. ఇందు విషయమై ధర్మకర్తృత్వ సంఘ సమావేశంలో జరిగిన చరిత్రాత్మకమైన చర్చలో భారత ప్రతినిధి శివరావుగారు అతి ప్రధానమైన పాత్ర నిర్వహించారు.

ఈ నిర్ణయం జరిగిన అనంతరం ధర్మకర్తృత్వసంఘం అధ్యక్షులు నైరుతి ఆఫ్రికా జాతీయుల వాఙ్మూలాలు తీసుకోవటానికి ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించారు. నైఋతి ఆఫ్రికా ప్రతినిధులలో ప్రస్తుతం వాఙ్మూలమివ్వటానికి ఒక్క స్కాట్‌గారే సిద్ధంగావున్నారు. తక్కినవారికి టెంటనే తమ అధికార పత్రాలతో సిద్ధంకావలసిందిగా ఉత్తర్వులు అందజేస్తారు.

## రెll మైకేల్ స్కాట్ సాక్ష్యం

### అనుమతించేవిషయమై ధర్మకర్తృత్వ సంఘం చర్చ

లేక్‌సక్సెస్, నవంబర్ 23: నైఋతి ఆఫ్రికా అనువాసులయిన హెబరో తెగ ప్రజలకుప్రక సాక్ష్యమివ్వటానికి అనుమతించవలసినదని రెవరెండ్ మైకేల్ స్కాట్ పెట్టుకున్న దరఖాస్తుమీద నేడు ధర్మకర్తృత్వ సంఘం చర్చించినది. తాము స్థానికప్రజల ప్రతినిధులమని తగిన నిదర్శనాలు చూపించకలిగిన ప్రతినిధు లందరికీ చర్చలో సాక్ష్యమిచ్చే అవకాశం ఇవ్వవలసిందని గౌటిమాలా చేసిన ప్రతిపాదనపై చర్చ జరిగినది. గౌటిమాలా చేసిన ప్రతిపాదనకు భారతప్రతినిధి చేసిన సవరణల్ల ఆఫ్రికన్ తెగల ప్రతినిధులు ఇంకెవరు వచ్చినా సాక్ష్యమిచ్చే అవకాశం ఇవ్వాలని ప్రతిపాదించబడినది.

చర్చ ప్రారంభించటానికి ముందు రెవరెండ్ స్కాట్ ధర్మకర్తృత్వ సంఘాధ్యక్షునకు వ్రాసిన లేఖలలో కొన్ని భాగాల ప్రతులు సభ్యులందరికీ పంచబడినవి. ఆ భాగాల ఈక్రింది అంశాలను వెల్లడిస్తున్నవి.

"నైఋతి ఆఫ్రికా ప్రజలకు దరఖాస్తులు పెట్టుకునే హక్కులనూ, రాజకీయ ప్రాతినిధ్యాన్నీ తొలగించటమే కాక వారు తమ జాతుల నాయకులనే రాయబారం పంపటానికికూడా దక్షిణాఫ్రికా అనుమతించలేదు. అందువల్లనే నాకు హెబరో జాతితోకానీ, మరెవరితోగానీ సంబంధం లేదంటున్నది."

హెబరోజాతి నాయకుడు హోసెర్ కుటాకో సమితి ప్రధాన కార్యదర్శికి, రెవరెండ్ స్కాట్ తమకు ప్రాతినిధ్యం వహిస్తున్నాడని పంపిన తంతివార్త ప్రతికూడా సభ్యులకు ఇవ్వబడ్డది.

సమితికి విజ్ఞప్తిచేసుకునే హక్కును కూడా దక్షిణాఫ్రికా ప్రభుత్వం తొలగించినదని రెవరెండ్ స్కాట్ చేసిన ఆరోపణను దక్షిణాఫ్రికా ప్రతినిధి ఖండించాడు. పాలస్తీనా సమస్యలో అరబ్బులు, యూదులతో సమితి సంప్రదించే పోలికదీనికి సరిపడదని అతడు వాదించాడు.

బెల్జియం గౌటిమాలా ప్రతిపాదనను ప్రతిఘటించింది.

### హైటీ హెచ్చరిక

హైటీ ప్రతినిధి అలెక్సిస్ ప్రసంగిస్తూ ఈ విధంగా హెచ్చరించాడు.

"రెవరెండ్ స్కాట్ సాక్ష్యాన్ని అనుమతించటమన్నది ఈనాటి అతి ప్రధాన సమస్యల్లో ఒకదానికి సంబంధించి ఉన్నది. ఒక తెల్ల జాతివ్యక్తి - ఆఫ్రికన్ల హలూ, పక్షపాతం ఉన్నవని అనుమానించటానికి రంగుజాతివ్యక్తికూడాకాదు. ఏ విధమైన స్వార్థమూలేని మతసేవకుడు, ఆఫ్రికన్ ప్రజలతరఫున మాట్లాడటానికి ఎంతో ఆవేశంతో ముందుకువస్తున్నాడంటే అది సామాన్య విషయంకాదు. ఏదో చట్టంలో అనుమతించ వీలులేదన్న నెపంమీద ఈయన సాక్ష్యాన్ని మనం నిరాకరిస్తే, గత కాలంలో ఇట్లానే నిజాన్నితొక్కిపెట్టాలని ప్రయత్నాలు జరిగినవి కాని చివరకు నిజమే బయటికివచ్చిందని సభ్యులను నేను హెచ్చరిస్తున్నాను."

లైబీరియా ప్రపంచంలో ఉన్న (ఆఫ్రికన్ జాతీయుల స్వతంత్రరాజ్యాల రెంటిలోనూ ఒకటి) ప్రతినిధి కిన్ ఇదే విధంగా సంఘాన్ని హెచ్చరిస్తూ "జర్మన్ వలసను హెబరో జాతివారు అతి తీవ్రంగా ప్రతిఘటించారు కాని వారతిక్రూరంగా అణిచివేయబడ్డారు. కాని ఈనాడు జర్మన్ సామ్రాజ్యం ఎక్కడున్నది? భగవంతుడు మన్మల్నందరినీ కనిపెట్టే ఉన్నాడు" అని అన్నాడు.

# ఆంధ్రరాష్ట్రం: త్వరలో విభజనసంఘఏర్పాటు

(1 వ పేజీ తరువాయి)

జారీచేస్తే అందులోను, లేక జనవరి 26 తర్వాత ప్రభుత్వ బిల్లుద్వారా రాష్ట్ర నిర్మాణం జరిగితే బిల్లులోను ఈ నిర్ణయాలు పొందుపరచబడును.

ఇద్దరు ముగ్గురు ఆంధ్రమంత్రులతోను అదేసంఖ్యగల ఇతరపక్ష మంత్రులతోను ఒక విభజనసంఘాన్ని నియమించవలసిందని, భారతప్రభుత్వం మద్రాసు ప్రభుత్వానికి తన ఉత్తర్వులో సూచించగలదని తెలియుచున్నది. విభజనసంఘానికి పనిలో తోడ్పడడానికి రాష్ట్రప్రభుత్వాలుకొన్ని ఉద్యోగుల కమిటీలనుకూడా నియమించవచ్చును. విభజనసంఘం వివిధవిషయముల మీద ఏకాభిప్రాయములను సాధించి తాముచేసిన నిర్ణయాలను భారత ప్రభుత్వానికి పంపవలెను. విభజనసంఘ నిర్ణయానికి ఈ క్రింది విషయములు అప్పగించబడినవని తెలియుచున్నది: ఆంధ్రరాష్ట్ర ప్రస్తుత ఆర్థికస్థితి; ఆస్తులు ఋణపణాల పంపకం, ఉద్యోగుల పంపకం, పరిహద్దుల నిర్ణయం, రాజధానీనగర నిర్ణయం, శాసన సభా నిర్మాణం. (పి. టి. ఐ.)

యు. పి. ఐ. విలేకరి ఇట్లు వ్రాయుచున్నాడు: గవర్నరు జనరలు త్వరగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తర్వు జారీ చేయగలందులకై, ఒక విభజన సంఘాన్ని నియమించి వివరములన్నీ తేల్చుకొని ఏకమత్యంగా నిర్ణయాలు పంపవలసిందని, భారతప్రభుత్వం మద్రాసు ప్రభుత్వానికి ఉత్తర్వుచేయ నిశ్చయించింది. విభజనసంఘానికి పనిలో తోడ్పడడానికి మద్రాసుప్రభుత్వం కొన్ని ఉద్యోగుల కమిటీలనుకూడా నియమించవచ్చును.

## పిఠాపురం యువరాజాగారి రాజీనామా

మద్రాసు శాసన సభ్యత్వానికి పిఠాపురం యువరాజా గారిచ్చిన రాజీనామాను ప్రభుత్వం వారంగీకరించిరి.

# భారతసమితిలో హైదరాబాద్ చేరిక

(1-వ పేజీ తరువాయి)

భారత దేశంతో ఆర్థికంగా, రాజకీయంగా, ఇంకా మరెన్నో విధాల గాఢ సాన్నిహిత్యం కలిగివుంది. భారత రాజ్యాంగ పరిషత్తు ముసాయిదా చేసిన రాజ్యాంగం, హైదరాబాదు భారత యూనియన్‌తో రాజ్యాంగ సంబంధం పెట్టుకోవటానికి వీలుకలిగిస్తున్నది. అంతేకాక సంస్థానాంతర్గత రాజ్యాంగ విధానమును మార్చటానికి కూడా వీలు కలిగిస్తున్నది.

నేను జాగ్రత్తగా ఆలోచించిన మీదనే ఈ నిర్ణయానికి వచ్చాను. హైదరాబాదు ప్రజలకు ఐక్య, ప్రజాస్వామిక భారతదేశంలో గౌరవ ప్రదమైన భాగస్వామ్యం కలిగించటానికే నేనీ నిర్ణయం చేశాను. అయినా, ఈ నిర్ణయం వల్ల బహు విస్తారమైన ఫలితాలు సంభవించనున్నవి కనుక, దీనిని సంస్థాన ప్రజలే ధ్రువపరచవలసి వున్నది. ఇండియాకు, ఈ సంస్థానానికీ ఎట్టి సంబంధము ఉండాలో నిర్ణయించే అంతిమాధికారం ప్రజలదే. వారే సంస్థాన రాజ్యాంగమును నిర్మిస్తారు.

ప్రజావాణి, త్వరలో ఏర్పడనున్న రాజ్యాంగ పరిషన్ముఖంగా ఉద్ఘోషమౌతుంది.

ఈ ఫర్మానా ద్వారా నేను ప్రకటించేదేమంటే,

"భారత రాజ్యాంగ పరిషత్తు త్వరలో ఆమోదించ నున్న రాజ్యాంగమును, ఇండియాలోని ఇతర భాగాలకు వలెనే హైదరాబాదుకు కూడా రాజ్యాంగమై వర్తిస్తుంది. ఆ విధంగా నేను, నా వారసులు అమలు చేస్తాము. ఆ రాజ్యాంగం అమలులోకి వచ్చే తేదీ నుండి, అదివరకే యీ సంస్థానంలో అమలులో వుంటూ పై రాజ్యాంగ నిబంధనలకు వ్యతిరేకంగా వుండే అన్ని నిబంధనలూ రద్దయిపోతాయి." అని ఫర్మానాలో నిజాం ప్రకటించాడు.

# నిజాం నిర్ణయం పై వివిధ వర్గాల హర్షం

హైదరాబాదు, నవంబర్ 25: భారత యూనియన్‌లో హైదరాబాదు చేరుతున్నదని గత రాత్రి నిజాం చేసిన ప్రకటన పై ఇక్కడి అన్ని పక్షాలు, వర్గాలు హర్షం వెల్లడిస్తున్నవి. "అసలిది ఎప్పుడో జరిగివుండవలసింది." అని అంతా అంటున్నారు.

"హైదరాబాదు ప్రవేశాన్ని గూర్చిన షరతులు సంతృప్తికరంగా ఉన్నాయి. ఎందువల్లనంటే అంతిమ నిర్ణయాధికారం ప్రజలకే వర్తిస్తుంది. కొందరు నిజాముకు ఈ మాత్రం కూడా అవకాశమివ్వరాదని అనవచ్చు. కాని ప్రవేశపు షరతులను విధించేయందు భారత ప్రభుత్వము అన్ని విషయాలను, ముఖ్యంగా హైదరాబాదు ప్రజా భీష్టాన్ని, కూలంకషంగా చర్చించేవుంటుంది. అందుచేత భారత ప్రభుత్వపు నిర్ణయాన్ని మనం ఆమోదించటం మంచిది" అని డా॥ జి. ఎస్. మేల్కోటే అన్నారు.

హైదరాబాదు షెడ్యూల్డు కులముల ఫెడరేషన్ అధ్యక్షుడు బి. షామ్. సుబ్బయ్య ఇలాగన్నారు:

"ఆలస్యంగా జ్ఞానోదయమైన నిజాం ఈ నిర్ణయం చేయటంలో చాల వివేకంగా ప్రవర్తించారు.

ఈ నిర్ణయంవల్ల హైదరాబాదు వ్యవహారాలలో చాలభాగం భారత యూనియన్‌కు సంక్రమించటం జరుగుతుంది. ప్రజలదే సర్వాధికారము అన్న విషయాన్ని నిజాం మొదటిసారిగా ఇప్పటికి గుర్తించారు. ప్రజలు నిర్ణయించవలసిన సమయం వచ్చినప్పుడు హైదరాబాదును ఇండియాలో విలీనం చెయ్యటానికే నిర్ణయిస్తారని నా విశ్వాసం. అంతేకాక సంస్థానమును విభజించటానికికూడా నిర్ణయిస్తారని నానమ్మకం. నిజాం ప్రస్తుత నిర్ణయానికి ఇదే సరియైన, సహజమైన పరిణామం.'

## నానాపటేల్ ప్రవేశనిషేధం

సికింద్రాబాద్, నవం 24: పత్రీ రానా యకుడైన నానాపటేల్ మరొక 6 నెలల వరకూ యీ సంస్థానంలోకి తన లిఖిత అనుమతి లేకుండా ప్రవేశించరాదని హైదరాబాద్ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ నిషేధాజ్ఞ ప్రకటించాడు.

## హాకీ, క్రికెట్‌వార్తలు

హైదరాబాద్, నవంబర్ 24: నేటి సాయంత్రం ఇక్కడ జరిగిన హాకీపందెములలో ఉస్మానియా విశ్వవిద్యాలయం జట్టు (5 గోలులు) ఉత్కళ విశ్వవిద్యాలయము జట్టును (0) ఓడించారు.

రంజీ క్రికెట్ పందెముల మొదటి భాగంగా డిసెంబర్ 9, 10, 11, 12 తేదీలలో సికింద్రాబాదు జింఖానా గ్రౌండ్సులో హైదరాబాద్ జట్టువారు సి. పి. జట్టుతో పోటీచేస్తారు.

## 'తుపాను దెబ్బ విపరీతమైనది'

### ఏమవరంలో బులుసు సాంబమూర్తిగారి ఉపన్యాసం

సత్వరం తగుసహాయం వెంటనే చేయాలని హెచ్చరిక

ముసరం, నవంబరు 20: బులుసు సాంబమూర్తి కర్నలోశాస్త్రిగార్లు తుపాను ప్రాంతాలు పర్యటిస్తూ నేడిచ్చటికి వచ్చిరి. తర్వాత స్థానిక కాంగ్రెసు నాయకులు డాక్టరు పాలకోజేటి సర్వ నారాయణశర్మ, చెలుకువాడ సుబ్బా రావుగార్లతో కోస్తారుప్రాంత పరిస్థితు లు పరిశీలించుటకు పల్లి సాయంకాలము వచ్చి ఇచ్చటి ప్రకృతి ఆగ్రహానికి గురి అయిన నష్టమును పరిశీలించిరి.

బహిరంగసభ

దుపరి వర్తకసంఘ భవనములో బాపిరాజుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో పాల్గొనిరి. బాపిరాజు సభను ఉపక్రమించుచు సాంబమూర్తి, శాస్త్రిగార్లు కృష్ణా జిల్లా సముద్ర తీరముగా ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్నారని, తుపాను ప్రాంతాలలో ఇంతవరకూ ఎవ్వరూ పర్యటించలేదని, వృద్ధులైనా అధిక ఉత్సాహంతో ఆపని చేస్తున్నందుకు వీరికి కృతజ్ఞత తెలుపవలెననిరి. శాస్త్రిగారు పశ్చిమ గోదావరి ప్రజలు దేశసేవను ప్రశంసించి ఆంధ్రరాష్ట్ర ఉద్యమము గురించి మాట్లాడుతూ చారిత్రాత్మకముగా మద్రాసు నగరము ఆంధ్రులదేనని, ఆంధ్రప్రజలంతా వాద ప్రతివాద సభలను జరిపి మద్రాసు ఆంధ్రులదే అని తీర్మానాలు చేయాలని హెచ్చరించిరి.

తుపానునష్టంగూర్చి మాట్లాడుచు బాధితులకు తగుసహాయాలు చేయటం ప్రభుత్వంయొక్క ప్రజలయొక్క విధ్యుక్త ధర్మమని నుడివిరి.

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని బాధలుపడిన 98 ఏండ్ల వృద్ధురాలు మూర్తి కనకమ్మగారు హరిజనులపై వ్రాసినపద్యాలని చదివి ప్రస్తుతం ప్రభుత్వంలో జరుగుతున్న అన్యాయాలను వ్యంగంగావిమర్శిస్తూ ఉపన్యసించిరి.

అనంతరము సాంబమూర్తిగారు ఆంధ్రకు తగిలిన తుపానుదెబ్బ విపరీతమైన దని మొదలుకొని ఈ పూర్తివరకూ పరిశీలించిన దానినిబట్టి స్పష్టమయినదనిరి. ప్రభుత్వం రైతులకు రెండుపంటలకు అవసరమైన విత్తనాలు పల్లివారలకు నూలు ఇచ్చి సహాయం చేయాలనిరి. ఆంధ్ర రాష్ట్రంగురించి మాట్లాడుచూ చిరకాల ఆంధ్రుల వాంఛ నేటికి ఫలించినదని, రాష్ట్రం ఏర్పడితే మనమంతా సుఖించవచ్చునని అనిరి. రాష్ట్రం సత్వరం ఏర్పడాలని, ఆలస్యం పనికిరాదనిరి. జె. వి. పి. రిపోర్టు ననుసరించి రాను ప్రభుత్వం ఆంధ్ర తమిళ కాంగ్రెసు సంఘాలు అంగీకరిస్తే మద్రాసు నగరంగురించి సరిహద్దు కమిషన్ ఎందుకు నియమించారో తమకు అర్థంకావటం లేదనిరి. ఇప్పుడున్న 78 మంది శాసనసభ్యులతో రాష్ట్రం ప్రారంభం కావాలనిరి.

రాజకీయ బాధితులకు భూములు మంజూరు చేయుటను విమర్శించుచు ఆపద్ధతి మంచిదికాదని, యు. పి. లోవలె నెలకు రు 80/-లు ఇచ్చుట శ్రేయస్కరమనిరి. డాక్టరు శర్మగారి అభినందనలతో సభ ముగిసెను. స్వ. వి.

## తుని తాలూకాలో తుపాను, వరదనష్టాలు

### తూ. గో. జిల్లా కలెక్టరు వివరణ

కాకినాడ, నవంబరు 22: తూర్పు గోదావరిజిల్లా కలెక్టరు డి. బాలసుందరం తుని తాలూకాలో పర్యటించి నిన్న రాత్రికి తిరిగి వచ్చిరి. తునిఫిర్కాలోనూ, ఆ తాలూకాలోను తుపాను, వరదలవల్ల కలిగిన నష్టములను గురించి వారిట్లు చెప్పిరి: తాలూకాలో మేజరు, మైనరు వ్యవసాయ సాగునీటి చెరువులు 70 కలవు ఇన్నియు వరదలవల్ల దెబ్బతిన్నవి. ప్రభుత్వ స్వాధీనములో లేని కొట్టాము ఎస్టేటులో యిన్నియు కలవు. వాటి మరమ్మతులకు జరుపుటకు ప్రాప్రయిటరు నిరాకరించెను. ప్రభుత్వ అనుమతిపొంద చెరువుల మరమ్మతులు డిపార్టుమెంటువారు చేయించుచున్నారు.

కలెక్టరుగారు కోటనందూరు, దివుసల పోలవరం, కాకరాపల్లి గ్రామాలు వెళ్లి పోయిన చెరువులుచూచిరి. డి. పోలవరంలో సెప్టెంబరు వరదలలో నారాయణ చెరువుకట్ట తెగిపోయింది. దానిని పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు వారు బాగుచేసిరి. కానీ ఇప్పటి వరదలలో తిరిగి తెగిపోయింది. ఆక్టోబరు వరదలలో తిరిగి ఈ చేగట్టు తెగింది. తాత్కాలికంగా గట్టును మూసివెట్టిరి. అది సవ్యంగా మర

## తుపాను బాధితులకు సహాయం

### నైనపూరులో సంఘం ఏర్పాటు

నైనపూరు, (సి. పి.) నవంబరు 19: స్థానిక ఆంధ్రసమాజంవారు కె. కె. మూర్తిగారి అధ్యక్షతను ఒక బహిరంగ సభను ఏర్పాటుచేసి ఆంధ్రదేశ తుపాను బాధితుల సహాయసంఘము ఒకటి ఏర్పాటుచేసిరి. సంఘమునకు అధ్యక్షుడుగ కె. కె. మూర్తి, సభ్యులుగ, వి. సుబ్బారావు, సోమయాజులు, ఎస్. ఆర్. మండా, వై. రామమూర్తి, రామారావుగార్లు ఎన్నికఅయిరి. ఈ గ్రామములో డబ్బు వసూలుచేయుటకు, జబల్‌పూరు, నాగపూరు మొదలగు చోట్ల నాటకములు వేసి నిధి సేకరించుటకు నిశ్చయించిరి.

### ఆంధ్ర తుపాను బాధితులకు రెడ్‌క్రాస్ విరాళము

న్యూఢిల్లీ, నవంబరు 24: తుపాను వల్ల నష్టపడిన ఆంధ్రుల సహాయార్థము భారత రెడ్ క్రాసు సంఘమువారు భారత ప్రధాని నిధికి 5 వేల రు విరాళ మిచ్చియున్నారు.

రాజమహేంద్రవరం

తుపానుబాధితుల సహాయార్థమై స్థానిక జీవకారుణ్య సంఘంవారు ఇండ్లకు తిరిగి పాతబట్టలు, విరాళములు వసూలు చేయుచున్నారు. ఇప్పటికి సుమారు వెయ్యి బట్టలు ప్రోగుచేసిరి. కొంత ధనముగూడ వసూలుచేసిరి. (స్వ. వి.)

విరాళాలకు విజ్ఞప్తి

గుడివాడతాలూకా పెనుమల్లెనుంచి చుండూరి లక్ష్మీ నాంచారమ్మగారిట్లు వ్రాసిరి:—

తుపానువలన నష్టపడిన గృహముల పునర్నిర్మాణము నిమిత్తము కృష్ణాజిల్లా కలెక్టరుగారు మంజూరుచేసిన సొమ్ము బహు కొద్దిమందికి మాత్రమే ముట్టినది. ఇంకనూ అనేకమంది గృహములు కోల్పోయిన బీదకుటుంబీకులు హరిజనులు వగయిరా పాటకజనము నిస్సహాయులై యుండిరి. గనుక కష్టదశలో నున్న బీద ప్రజానీకమునకు విరివిగా విరాళముల నొసంగి తమ సహాయముచేసి రక్షించవలెనని మద్రాసు దొరతనమువారిని, ఉదారులను ప్రార్థించుచున్నాను.

కృష్ణాపురం (గన్నవరం తా॥)

తుపానువల్ల ఈగ్రామంలో 300ఇండ్లు నష్టము పొందినటుల, ప్రాయగా గవర్నమెంటు సహాయనిధినుండి, ఈ నెల 20 న 60 యిండ్లకు యింటి 1 కి రు. 10-0-0 చొ॥ రు. 600/-లు యిచ్చిరి. మిగతా 240 యిండ్లకు సహాయం చాలా అవసరం ఆయివున్నది. అని ఫిర్కా కాంగ్రెస్ కార్యకర్తల సంఘాధ్యక్షుడు కోన. ఆదినారాయణ వర్మగారు వ్రాసిరి.

పెంజండ్ర (గుడివాడ తా॥)

పెంజండ్ర గ్రామ కాంగ్రెస్ అధ్యక్షుడు బొప్పన వటుంబరావుగారిట్లు వ్రాసిరి: తుపానువలనమా గ్రామములో 600 యకరములలో వరికోసే అవసరం కూడా లేకుండా పోయింది. ఉన్న 500 యిండ్లలో 250 పడిపోయినవి. బోర్డు స్కూలు కూడ పడిపోయినది. ఒక యింటిలో యిద్దరు మహ్మదీయులు చనిపోయారు. 30 పశువులుచనిపోయినవి. మొత్తంనష్టము రెండులక్షల రూపాయలు వుండును నష్టపడిన భూములకు ఎలమఱ్ఱ ఎస్టేటువారు శిస్తువసూలు చేయకుండా చేయుగలందులకు గవర్నమెంటువారిని కోరుచున్నాను.

మ్మతు చేయడం విషయమై స్థానిక రైతుల ఆజమాయిషీలో ఆలస్యం లేకుండా జరిపించుట కేర్పాట్లు జరిగినవి.

"తునిలో వరదలు ఉధృతంగా రావడానికి ప్రధాన కారణం తాండవనదీ ప్రవాహమే. యుద్ధకాలంలో మిలిటరి అధికారులు బరువుబండ్లు వెళ్లుటకు నదిపై రోడ్డువంతెన నిర్మించిరి. ఇదిగాక విశాఖపట్నంజిల్లా చెరువు ఎస్టేటులోని భూముల వ్యవసాయము నిమిత్తము నీరుపోవుటకు గాను నదిపైన 2 చిన్న డాములు నిర్మించబడినవి. ఈ 2 చిన్న డాములవల్ల భూములలోనుంచి నీరు వడిగాపోవుటకు వీలు లేకుండా, ఇసుకమేటవేసింది. అందువల్ల మీరు పోవుటకు యితర దారులు చేసుకుంది. టవునకు రక్షణగా ఎత్తుగట్టులు కూడాలేవు. నగరసమీపాన హెచ్చు తూములు నిర్మించడం రైల్వే డిపార్టుమెంటువారి విధియై యున్నది. ఉన్న తూము వెడల్పు చేయ్యాలి. లేకపోతే రైలులైను దెబ్బతింటూంటుంది."

ఈవిషయాలన్ని జాగ్రత్తగ పరిశీలించి త్వరలో నివారణోపాయములవల్ల మళ్ళీ యిట్టి పరిస్థితి వాటిల్లకుండ సాధించాలి.

తునిలో పలుకుబడికలిగిన ప్రముఖుల సహాయసంఘ మొకటి స్థాపితమై విరాళాలుపోగు చేయబడుచున్నవి.

ఎ. వెంకటనగరంలో ప్రమాదమైన వరదవల్ల 250 యిండ్లు కూలిపోయినవి. నయ్యి ఎకరాల సాగుభూమి ముంపుకు నష్టాన్ని పొందింది. రైతులతో కూడిన రిలీఫ్ కమిటీ నెలకొల్పబడింది. రైతులు రూ 1275/- విరాళాలొసంగిరి. స్వ. వి.

## 'చెంగల్పట్టుజిల్లాను చెన్నపట్నంతో కలిపి ప్రత్యేక రాష్ట్రం చేయాలి'

### బూదూరు పౌరమహాజనసభ తీర్మానం

బూదూరు (పొన్నేరి తా॥,) నవంబరు 20: చెంగల్పట్టు జిల్లాలో 9 లేక 10 లక్షల ఆంధ్రులుకలరు కనుక భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సందర్భంలో ఈ జిల్లాను చెన్నపట్నంతో కలిపి ప్రత్యేకరాష్ట్రం ఏర్పాటు చేయవలెనని, అది సాధ్యపడనిచో ఈ జిల్లాలోని పొన్నేరి తిరువళ్ళూరు తాలూకాలలో ఆంధ్రులు అధిక సంఖ్యాకులుగాగల ప్రాంతాలను ఆంధ్ర రాష్ట్రంలో చేర్చవలెననీ భారత ప్రభుత్వమును కోరుచు మొన్న 15-వ ఇక్కడ తాతి రామారెడ్డిగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో తీర్మానించిరి.

మదనంబేడు గ్రామంనుంచి నరసయ్య, వెంకటాజూకండ్రిగనుంచి దొం. వెంగమ రాజు; వెల్లిమాను కండ్రిగనుంచి మారెడ్డి గోపాలురెడ్డి; బాలక్రిష్ణాపురంనుంచి గాలి శేషమనాయుడు; అచ్చమనాయుడు కండ్రిగనుంచి వు. దొరసామినాయుడు; బొమ్మాజిగుంటనుంచి గె. సుబ్రామారెడ్డి గార్లు మొదలగువారు వచ్చి ఈ సభలో పాల్గొనిరి. సుమారు 2000 మంది, ఆంధ్రులు హాజరైరి. ఈ క్రింది తీర్మానములు క్షుణ్ణముగా చర్చించి యేకగ్రీవముగా ఆమోదించిరి. తీర్మానమును, కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్ర ప్రభుత్వమునకును, రాష్ట్రపతికి, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షునికి పంపుటకు నిర్ణయించిరి.

తీర్మానం పూర్తిపాఠం

చెంగల్‌పట్టుజిల్లా అనునది తరతరములగా, గడచిన బ్రిటీషు ప్రభుత్వమునగూడ; ద్విభాషాజిల్లా. యీ జిల్లాలో షుమారు 9 లేక 10 లక్షల ఆంధ్రులు వున్నారు. భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన జరుగుసూచనలు కనబడుచున్నవి. ద్విభాషాప్రాంతమైన చెంగల్ పట్టు జిల్లాను, బహుభాషా ప్రాంతమైన మద్రాసుతో కలిపి; ఢిల్లీవలె కమీషనర్ పరిపాలనతో పరిపాలించిన యీ జిల్లాలోగల ఆంధ్ర, తమిళులు యెప్పటి అట్లుస్నేహ సహకారములతో మెలగగలరు. లేకున్న తమిళరాష్ట్రములో, చెంగల్‌పట్టుజిల్లాను చేర్చినయెడల, ఆంధ్రులభాషకు, సంస్కృతికి, ఆచారవ్యవహారములకు, ధనమాన ప్రాణహక్కులకు భంగము వాటిల్లునని యీ ప్రాంతపు, ఆంధ్రప్రజలు భయభ్రాంతులగుచున్నారు. గాన యీ జిల్లాను పైచెప్పిన ప్రకారం ప్రత్యేకరాష్ట్రముగా చేయవలయును.

అట్లు చేయుటకు వీలుగాకున్న, పొన్నేరి, తిరువళ్లూరు, తాలుకాలలో ఆంధ్రులు అధికసంఖ్యాకులుగా గల ప్రాంతాలను ఆంధ్రరాష్ట్రములో చేర్చవలయును.

### ఆంధ్రలో చేరవలసిన బళ్లారిజిల్లా ప్రాంతాలు

జి. సి. తిమ్మారెడ్డిగారి సూచన

గుంతకల్లు, నవంబరు 22: ఈ పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు జి. సి. తిమ్మారెడ్డి గారిట్లు వ్రాసిరి: 30 సంవత్సరాలుగా రాష్ట్రసిద్ధికై తపస్సుచేస్తూవుండిన ఆంధ్రుల ఆశయాలు యీనాటికి నెరవేరినవి. అయితే ఆంధ్రరాష్ట్రానికి తమిళ కర్నాటక సరిహద్దు తగాదాలు కొంతవరకు అటంకాలు కల్పిస్తాయి. ఈ సరిహద్దుల విషయమున వారి ఆశలకు హద్దులేనేది వారి ప్రకటనవల్ల విశదమౌతున్నది. పైగా కొందరు ఆంధ్రరాష్ట్రంవద్దు అంటూ, రాయలసీమ అరవల సాహచర్యంలోనే వుండిపోవాలనే వాదాన్ని లేవదీస్తున్నారు. ఇది చాలా గర్హించవలసిన విషయం.

కెల్కారు అవార్డు ప్రకారం బళ్ళారి జిల్లాలోగల ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు ఆంధ్రరాష్ట్రంలో చేర్చతగిన తాలూకాలుగా స్థిరీకరించబడినాయి. అవిపోను తక్కిన తాలూకాలు కర్నాటకరాష్ట్రంలో చేరవలసియున్నా, బళ్ళారి తాలూకాలోని మరి కొన్ని గ్రామాల విషయము సరిహద్దు పరిశీలన సంఘము వారు గమనించ వలసియున్నది.

బళ్ళారితాలూకాలో చేరి హగరీనదికి తూర్పుదిక్కునవున్న కారేకల్లు, కారేకల్లు వీరాపురం, జాలిహాళ్ళి మోక, పరమదేవరపల్లి, రూపనగుడి, రాయాపురం మొదలైన గ్రామాలు, హగరీనది తూర్పు తీరస్థాలే బళ్లారి తాలూకాకే చేరిన మరి కొన్ని గ్రామాలు ఆంధ్రప్రాంతంలో చేరవలసినట్టివి. ఈ గ్రామాలు కేవలం ఆంధ్రసంప్రదాయంతో ఆంధ్రమే మాతృభాషగాగలిగిన ప్రజలు ఉన్నట్టివి. గాన యీ గ్రామాల విషయంలో సరిహద్దుల పరిశీలక సంఘము వారును బళ్ళారిజిల్లా ఆంధ్రనాయకులునూ తగు జాగ్రత్త తీసుకొని బళ్ళారితాలూకాలో హగరీనదిని ఆంధ్ర కర్నాటక సరిహద్దుకు ప్రతిపాదికగానుండునట్లు ప్రయత్నం చేస్తారని కోరుతున్నాను.

## నైగీరియాలో కల్లోలాలు

### కార్మికులపై పోలీసు కాల్పులు

లాగోస్ (పశ్చిమ ఆఫ్రికా) నవం 24:- నేడు నైగీరియాలో తూర్పు రాష్ట్రానికైన ఎనుగు, అబా, ఒవెర్రీలలో ప్రజలు యీరాపియన్ల ఇళ్లనూ, దుకాణాలనూ లూటీచేస్తూ కల్లోలాలు జరిపినట్లు తెలియవచ్చినది. కిందటి వారంలో ఎనుగు రాష్ట్రములోని బొగ్గుగని కార్మికులమీద బ్రిటిష్ పోలీసులు తుపాకులు కాల్చినందుకు ప్రతిక్రియగా ప్రజలు ఈ కల్లోలాలు జరుపుతున్నట్టు తెలియవచ్చినది. నైగీరియా బ్రిటిష్ వలస రాజ్యము.

కిందటి శుక్రవారంనాడు లాగోస్‌కి తూర్పున ఉన్న ఎనుగులో పోలీసులు సమ్మె చేస్తున్న కార్మికుల మీద తుపాకులు కాల్చిన దానికి ఫలితంగా ముప్ఫయి నలభయి మంది చనిపోయినారనీ, ఎంతో మంది గాయపడ్డారనీ తెలియ వచ్చినది. సమ్మెదారులు వారి భార్యలు కలిసి గని యజమానుల ఇళ్లకు నిప్పుముట్టించి సమ్మెను భేదించ ప్రయత్నించిన తమపై దాడి చేయటంవల్ల కాల్పులు జరిపామని పోలీసులు అంటున్నారు. నైగీరియాలోని కార్మిక, రాజకీయ సంస్థలన్నీ కలిసి కాల్పులను నిరసిస్తూ ఒకఅవాంతర కార్యాచరణ సంఘాన్ని నెలకొల్పినవి.

ఈ ప్రాంతంలో ఉన్న 1500 మంది బొగ్గుగని కార్మికులు తమ కూలిని 5 షిల్లింగులకు 10 పెన్నీలకు పెంచాలని కోరగా ప్రభుత్వం నిరాకరించింది.

నేటి కల్లోలాలలో గాయపడ్డవారి సంఖ్య తెలియలేదు.

## అంతర్జాతీయ క్రయ విక్రయసంస్థ స్థాపనకు అమెరికా అభ్యంతరం

### ఆహార సమస్యపై ప్రపంచ ఆహార వ్యవసాయ కమిషన్‌లో చర్చ

వాషింగ్టను, నవంబరు 24: నేడు ఆహార వ్యవసాయ సంఘ సమావేశంలో ప్రపంచ ఆహార సమస్యపై చర్చలో అంతర్జాతీయ క్రయవిక్రయ సంస్థ స్థాపించాలనే సూచనను అమెరికా తీవ్రంగా ఆక్షేపించింది. ఇట్టి సంస్థవల్ల అంతర్జాతీయ విధానాలకు అడ్డువస్తుందనీ, అమెరికా వివిధ దేశాలకు చేసే ఆహార యీనుములు ఫలితంగా అమెరికాపేర సులభ చలామణీ ద్రవ్యాల నిలవలు పేరినమాత్రం చేత ఆహార సమస్య పరిష్కారం కాబోదనీ కొన్ని దేశాలు తమ ద్రవ్యాలను అమెరికా పేర నిక్షేపించలేవనీ, ఆహార సమస్యా పరిష్కారానికి దీర్ఘకాల పథకంగా గాని పునాదిగాగాని పనిచేయదనీ, తరువు దేశాలు తమ సంపదను పెంపొందించుకొనడానికి సహాయం చేయడమే సరి అయిన మార్గమనీ అమెరికా ప్రతినిధి స్టాన్లి అండ్రూస్ అన్నారు.

ఆహార సమస్యను కొంతవరకైనా పరిష్కరించగల ఎట్టి తీర్మానాన్ని అయినా బ్రిటను బలపరుస్తుందని మాట యిచ్చిన బ్రిటిషు వ్యాపారబోర్డు అధ్యక్షుడు హారోల్డువిల్సన్ అంతర్జాతీయ సంస్థ సంబంధించిన కొన్ని ప్రత్యేక సూచనలకు అభ్యంతరం చెబుతూ, వ్యాపారపులోట్లు చెల్లించుకోలేకుండా ఉండేదేశాలు తమ ద్రవ్యానికి మార్పిడి అవకాశం దొరుకుతుందనే ఆశతో ఆ ద్రవ్యాల నిలవలను హెచ్చించుచూపోతే వస్తారు. యీ సమస్యకు పర్మిటులు పెట్టీలకు వదులాలని కమిషను అధ్యక్షుడు చేసిన సూచనను ఈయన బలపరిచారు.

అంతర్జాతీయ క్రయవిక్రయ సంస్థ స్థాపించాలన్న సూచన చేసినది ఆరుగురు అంతర్జాతీయ నిపుణులుగల సంఘం.

భారత ప్రతినిధికై అభయంకర్ బ్రిటిషు ప్రతినిధి చెప్పిన అభ్యంతరాన్ని బలపరిచారు. తనకున్న డాలరుపరపతి యావత్తూ ఆహారధాన్యాల దిగుమతికింద, అధికో త్పత్తికొరకు యంత్రపరికరాలకిందా వినియోగించవలసిన ఇండియా లేని జాతీయ బుణాలను పెంచుకోలేదని ఆయన తెలిపారు. సులభద్రవ్య చలామణీ దేశాలకు ఆహారపదార్థాలు చవుకగా అందించబడాలనీ, అన్నిదేశాలమధ్యా ద్రవ్యమారకం సాధ్యమయేవరకూ, సగం ప్రపంచం తిండికి మాడుతూ మిగతా సగం ఆహార ధాన్యాల మిగుల్లు వదలించుకోలేని తరుణంలో, ఇది ఒకటే మార్గమనీ అభయంకర్ అన్నారు.

కెనడా ప్రతినిధి జేమ్స్‌గార్డినర్ క్రయవిక్రయ సంస్థకు ఒప్పుకొన్నారుగాని దానిని ఏర్పాటుచేసే పద్ధతికి ఆమోదించలేదు. ప్రపంచ ద్రవ్యపు చిక్కులు పరిష్కారమైతేనేగాని కెనడావలె ఆహార ధాన్యాలు ఎగుమతిచేసే దేశాలు సరిఅయిన సహాయంచేసే ఆశలేదని ఆయన అన్నారు.

ఆస్ట్రేలియా ప్రతినిధి, క్రయవిక్రయ సంస్థవంటిది అవసరమని అన్నారు. సభ రేపటికి వాయిదా పడింది.

### పాకిస్తాన్ ప్రతినిధి అభిభాషణ

వాషింగ్టను, నవంబరు 23: నేడు ఇక్కడ జరిగిన ఆహారవ్యవసాయ సంస్థ యొక్క వార్షిక మహాసభలో పాకిస్తాను ప్రధాన ప్రతినిధి ఫిరోజ్ ఖాన్‌నూన్, ఆహారవ్యవసాయసంస్థలో చేరిన దేశాలు రక్షణలకుగాను చేసేఖర్చును ప్రజల అభివృద్ధికి వినియోగించవలసీ, పాకిస్తాను తన రాబడిలో నూరింట 70 వంతులు రక్షణ కింద ఖర్చుచేస్తున్నదనీ, ఇండియాకూడా అంతఖర్చు చేస్తూండవచ్చుననీ, అన్ని దేశాలూ ఇదేరీతిగా ఖర్చుచేస్తున్నవనీ, ఐక్యరాజ్యసమితి వివిధ దేశాలకు గల ఈభయాన్ని తొలగించకపోతే అది విఫలమైనట్లే నని అన్నారు.

ఆయన ఇంకా ఈ విధంగా చెప్పారు:

"మనం రక్షణకింద ఖర్చుచేసే ఈ ధనమంతా ప్రజల సాంఘికాభివృద్ధికి వినియోగపడాలి. ఆర్థికసహాయార్థం ప్రణాళి కలుతయారుచేసిన మాత్రానఆసియా దూర ప్రాచ్యాలకు తృప్తికలుగదు. వాళ్లకు ఫలితాలు కనిపించాలి. ఆసియాప్రజలు తిండికి మాడుతున్నారు."

పాకిస్తానుప్రతినిధి అంతర్జాతీయ క్రయవిక్రయసంస్థను బలపరుస్తూ ఆహార వ్యవసాయ సంస్థవారు ఆహారోత్పత్తిపై కంట్రోలు పెట్టి కాలక్రమాన అవసరపు ఆహారం ఉత్పత్తి కాకుండా చూడాలనీ, ఆహార పదార్థాల ధరలు న్యాయంగా ఉండేలాగు నిర్ణయించాలనీ, లేనిచో కొన్ని దేశాలు ఇతర దేశాలను పీడించగలవనీ అన్నారు.

మారకం విలువ తగ్గించడానికి వీలులేని అంతర్జాతీయద్రవ్యం అమలులోకి రావాలనికూడా ఆయన సూచించారు.

"ఇతరదేశాల ప్రమేయం లేకుండా కొన్ని దేశాలు ద్రవ్యమారకంరేటు తగ్గించడం ఇతరదేశాలకు నష్టం. ఈ విధంగా తగ్గించడంవల్ల ఆహారపదార్థాల సప్లయిలకు తీరని నష్టం కలిగిందని నా విశ్వాసం. ఒక దేశం తన ద్రవ్యమారకంరేటు తగ్గించడం వల్ల పాకిస్తాను గోధుమలకూ, నారకూ, ప్రత్తికీ, తోళ్లకూ దెబ్బతగిలింది," అని ఆయన అన్నారు.

## చైనాలోని అమెరికన్ సైనికోద్యోగి

### ప్రయాణఅనుమతినిరాకరణ

వాషింగ్టను, నవంబరు 24: చైనాలో నాంకింగు నగరమందున్న అమెరికను రాయబారి కార్యాలయములోని సైనికోద్యోగి యగు బ్రిగేడీరు జనరలు రాబర్టు హెక్సోల్‌గాక అమెరికాకు తిరిగిరావలసిన దిగా అమెరికా ప్రభుత్వము రెండు మాసములక్రిందటనే ఉత్తరువు చేసెను. చైనా నుండి బయలుదేరివచ్చుటకై అనుమతిపత్రము ను ఇప్పించవలెనని అతికుఅచటికమ్యూనిస్టు ప్రభుత్వానికాయనకు కోరెను. తనకు తన భార్యకు తన కుమార్తెకు అనుమతి పత్రము కావలెనని కోరెను. కాని నాంకింగులోని కమ్యూనిస్టు ప్రభుత్వము యీ దరఖాస్తును నిరాకరించెనని నేడు అమెరికాలో వాషింగుటను నగరమందు అమెరికను సైనికశాఖాధికారులు ప్రకటించిరి.

## పారిశ్రామికులకు ప్రధాని అట్లీ విజ్ఞప్తి

లండన్, నవంబరు 24: ప్రతి కార్మికుడు ఎక్కువగా ఉత్పత్తి చేసి, ఎక్కువ డబ్బు సంపాదన చేసుకోడానికి వీలుకల్పిస్తూ, పరిశ్రమదారులు ఉత్పత్తి ప్రోత్సాహకరమైన పథకాలు వేయవలెనని, ప్రధాన మంత్రి అట్లీ నేటిరాత్రి బ్రిటిష్ పరిశ్రమదారులకు విజ్ఞప్తి చేసెను.

వేతనాలు పెంచవలెనన్న కోరికను ప్రస్తుతానికి విరమించు కోవలసిందని ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్మికులకు సలహా ఇవ్వటం చాలాధైర్యంతో కూడిన పని అని అట్లీ ప్రశంసించెను.

### ఇనుము ఉక్కు పరిశ్రమ బిల్లుకు రాజుగారి ఆమోదం

లండన్, నవంబరు 24: ఇనుము, ఉక్కు పరిశ్రమను ప్రభుత్వపరం చేసేబిల్లు ఈ వేళ రాత్రి ప్రభువులసభలో ఆమోదింపబడి రాజుగారి ఆమోదానంతరం శాసనమైంది.

## వందలాది జాతీయ చైనా సైనికులు

### పాకిస్థాన్‌కు రాక

కరాచీ, నవంబరు 22: వందల కొలది జాతీయ చైనా సైనికులు, పౌరులు పిల్లలతోకూడా ఈ వేళ హిమాలయాల గుండా పాకిస్థాన్‌కు వెళ్లిపోతున్నారు. వీరు 15 వేల అడుగుల ఎత్తైన హిమాలయ లోయలగుండా ప్రయాణిస్తున్నారు. వీరిలో అయిదుగురు జాతీయ చైనా సైన్యాధిపతులుగూడా ఉన్నారు. వీరు సీకియాంగ్ రాష్ట్రం కమ్యూనిస్టులవశం కాకముందే దుర్గమ హిమాలయాలగుండా ప్రయాణం ప్రారంభించారు.

వీరిలో ఒక 50 మంది ముందుగా కరాచీ చేరకున్నారు. వీరు త్వరలో తిరిగి జాతీయ చైనా సైన్యంలో చేరగలరట. మిగిలినవారు గిల్గిట్‌లో చిక్కుబడిపోయారు. హిమ ప్రవాహాలవల్ల ఈ గిల్గిట్‌కు, మిగిలిన పాకిస్థానుకు రాకపోకలు నిలిచిపోయాయి.

ఆహారపదార్థాలు తక్కువగా ఉండడంవల్ల గిల్గిట్‌లకు వీరిరాకవల్ల చాలా ఇబ్బందిగాఉన్నదట. విమానాలు కావలిసినన్ని లభించగానే వీరు పెషావరువెళ్లి అక్కడినించి కరాచీకి బయలుదేరగలరని తెలుస్తున్నది.

వీరి ఉనికివల్ల తనకు లేనిపోని తగాదాలు రావచ్చునని పాకిస్థాను ప్రభుత్వం భావిస్తున్నదట.

ఈ సైన్యాధిపతులలో ఒక సైన్యాధిపతి అప్పుడే హాంకాంగ్‌కు ప్రయాణమైనాడట. ఆ తరవాత మరి ఒక ముగ్గురు సైన్యాధిపతులుగూడాఅక్కడికి వెళ్లిపోవడానికి సిద్ధంగాఉన్నారట.

ఈ సైన్యాధిపతులలో ఒకడు మాట్లాడుతూ తనదగ్గర బంగారం ఎక్కువగా ఉన్నమాట అబద్ధమనీ, చైనాలో బంగారం దొరకడం చాలాకష్టంగా ఉన్నదనీ అన్నాడట.

ఈ సేనాధిపతులలో మరి ఒకడు మక్కా వెళ్లిపోవడానికి అనుమతించవలసిందని అరేబియా ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకున్నాడని తెలుస్తున్నది.

### క్వాంగ్సీ రాజధాని కమ్యూనిస్టుల వశం

హాంకాంగ్, నవంబం 24: నైఋతి చైనాలో క్వాంగ్సీ రాష్ట్ర రాజధాని క్వైలిన్ నగరాన్ని జనరల్ లిన్‌పియావో ఆధ్వర్యాన పోరాడుతున్న కమ్యూనిస్టు సేనలు ఆక్రమించినట్లు కమ్యూనిస్టు సైనిక కార్యాలయ ప్రకటన తెలుపుతున్నది.

## కాశ్మీర్ కమిషన్ నివేదిక

### విచారణ వాయిదాపడే అవకాశం

లేక్‌సక్సెస్, నవంబర్ 24: ప్రస్తుత సూచనలననుసరించి కాశ్మీర్ కమిషను నివేదిక, ఇప్పుడు వ్రాగు తయారు చేయుచున్న నివేదిక డిసెంబర్ 15 తే పూర్వము భద్రతాసంఘమువారికి చేరు అవకాశము లేదని భారత ప్రెస్ ట్రస్టు విలేఖరి వాగల్ తెలుపుచున్నాడు. మొదట అనుకొన్నట్లు ఈనివేదికను డిసెంబర్ 10 తే లోపుగానే తెప్పింప ఐక్యరాజ్య సమితి కార్యదర్శి కృషిచేయుచున్నాడు. కాని కట్టకడపట తెలిసిన సమాచారమువల్ల యింకా కొన్ని రోజులు ఆలస్యము జరుగవచ్చునని తెలియుచున్నది. డిసెంబర్ 15 తే తర్వాత జనరల్ ఎసెంబ్లీ సభజరుగదు. డిసెంబర్ 15 తే పూర్వమే నివేదిక ప్రతులను సభ్యులకు పంచిపెట్టవలెనని అధ్యక్షుడు జనరల్ కార్లోస్ రోములో వాంఛించుచున్నాడు. కమిషను నివేదిక డిసెంబరు మధ్యభాగమునకు చాలా పూర్వమే చేరకపోయేయెడల ఈ నివేదికపై చర్చను క్రొత్త సంవత్సరమునకు వాయిదా వేయవలసియుండునని సమితి కార్యాలయ ప్రముఖులు తలచుచున్నారు. ఎందుకనగా సమితి సభ్యులందరు, భద్రతాసంఘసభ్యులతో సహా అందరు క్రిస్టమస్ సెలవులకు యిండ్లకు వెళ్ళగోరుచున్నారు. జనరల్ ఎసెంబ్లీ సభ సమాప్తమైనతరువాత వారిచ్చుట కొద్ది రోజులుమాత్రమే యుండును. ఈ కొద్ది రోజులలో నివేదికను పరిష్కరింప వీలు లేదని వారు చెప్పుచున్నారు.

## ఇండియావస్త్ర ఎగుమతులకు దెబ్బ

### జపాన్ స్టర్లింగ్ ప్రాంత వాణిజ్య ఒప్పంద ఫలితం

బొంబాయి, నవంబరు 24: జపాన్ స్టర్లింగ్ ప్రాంతంతో వాణిజ్య ఒడంబడిక చేసుకుని ప్రపంచ వాణిజ్య రంగంలో ప్రవేశిస్తున్నందువల్ల భారతీయ వస్త్ర పరిశ్రమకు దెబ్బతీగిలే పరిస్థితి ఏర్పడినదనీ, ఎగుమతులు ఎక్కువచేయటంలో ఇండియా ఇప్పుడు తనశక్తి నంతా కేంద్రీకరించవలసి ఉన్నదనీ అఖిలభారత దిగుమతి వ్యాపారుల సంఘాధ్యక్షుడు కల్యాన్జీ భాటియా నేడొక ప్రకటనలో హెచ్చరించాడు.

"స్టర్లింగ్ ప్రాంతంతో వాణిజ్య ఒడంబడిక చేసుకొనటంవల్ల కిందటి యుద్ధంలో తాను కోల్పోయిన వ్యాపారస్థానాన్ని సంపాదించుకొనటానికి జపాన్ బయలుదేరుతున్నది. జపాన్ సప్లయిలు లేని కాలంలో అనేక దేశాలకు సప్లయిచేసే అవకాశాన్ని సంపాదించుకున్న భారతీయ వస్త్ర పరిశ్రమకు ఇప్పుడు దెబ్బ తగులుతుంది. అందువల్ల తనువ్యాపారాన్ని నిలబెట్టుకొనటానికిగాను ఎగుమతులను పెంచటంలో దేశం తగిన శక్తివంతటినీ వినియోగించాలి. ఎగుమతులకు అవసరమైన ఉత్పత్తులను నిర్వహించటంలో ప్రభుత్వం నిర్బంధాలన్నిటినీ తొలగించి పారిశ్రామికులకు తోడ్పడాలి. మిల్లులకు కావలసిన ప్రత్తిని సప్లయి చేయాలి.

దెబ్బతిన్న దేశమే ఐనప్పటికీ జపాన్ వెనకటి స్థితికి త్వరలోనే పోగలదు. ఒడంబడికలుబట్టి మనం జపాన్ వస్త్రాలను కొనవలసి ఉంటుంది కనుక మనవాడుక కావలసిన వస్త్రాలన్నీ లభించగలవు. అందువల్ల ఎగుమతులనుంచి, ఆధనంలో అవసరవస్తువులను కొనుక్కోవచ్చును" అని ఆయన వివరించాడు.

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 27 ఆదివారం

### మద్రాసు (ఎ)

7-0 స్వాగతం 7-30 ఉదయ సంగీతం (రి) 8-15 గానమంజరి (రి) 9-0 వాద్య సంగీతము (రి) 9-10 'బి' వలె 1-0 టి. వి. వసంత 1-40 సినిమా సంగీతము (రి) 2-10 'బి' వలె 3-0 వేదైకారి శబ్దపంక్తి పవిత్రము 4-0 'బి' వలె 5-30 పలయూర్ కనక సభాపతి అయ్యర్ 6-10 ప్రకటనలు వగైరా 6-15 పి. ఎల్. సుబ్బలక్ష్మి 6-45 వి. పార్థసారథి 7-30 గీతమంజరి (రి) 7-45 'బి' వలె 8-0 లలితా దత్ 8-30 'బి' వలె 9-30 పి. ఎస్. రాఘవరావు.

### మద్రాసు (బి)

7-0 వార్తలు 7-15 నీలమ్మాకొమంది (రి) 8-45 'ఏ' వలె 1-0 'ఏ' వలె 1-50 వార్తలు 2-0 వీణ, నిలయ విద్వాంసుడు 2-15 ఆటవిడుపు నిర్వహణ న్యాయపతి రాఘవరావు 3-0 'ఏ' వలె 4-0 ఎస్. సి. వసంతకోకిలం (రి) 4-30 'ఏ' వలె 5-30 'ఏ' వలె 6-15 సాయం. సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-0 వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-45 పండితెర చలనచిత్ర సమీక్ష: ఎస్. అన్నపూర్ణాదేవి 8-0 'ఏ' వలె 8-30 సి. వి. ధనలక్ష్మి, వయొలిన్ 9-0 'ఏ' వలె 9-45 శ్రోతల కోరినపాటలు (రి)

### విజయవాడ

7-0 వార్తలు 7-15 మధురమణి అయ్యర్ (రి) 7-30 ఈమని వెంకటరమణమ్మ 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 వినవీధి:- సీమనుంచివచ్చిన గిరీశం, నాటిక రచన నార్ల చిరంజీవి ఆత్మానుబంధం కథానిక వై. ఎమ్. శర్మ ప్రబంధవీథిక మనుచరిత్ర 1-0 తారాపథము (రి) 1-40 వాద్యసంగీతం (రి) 4-0 పేరంటము 5-20 సింగరాజు సూర్యనారాయణరాజు 6-10 ప్రకటనలువగైరా 6-20 గీతమంజరి (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7-0 వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 ఈమని వెంకటరమణ 7-45ఇంద్రధనుస్సు దర్పణ: దీక్షిత్ 8-0 వాలిపర్తి పిచ్చహరి—నాదస్వరం; 9-15 మద్రాసువలె; 9-30 సూర్యనారాయణరాజు.

### హైద్రాబాదు

7-30 బంగారీబాయి; 7-45 మల్లార్ రావు; 8-20 సంగీత పట్టం (రి); 8-30 కర్నాటక సంగీతం; 8-50 వార్తలు 9-15 ఉస్మాన్ ఇష్తికారి; 12-30 బరిహాన్, చోటాబాయ్ (రి); 1-0 వి. నాగయ్య (రి); 1-40 రాజేశ్వరరావు, బాలసరస్వతి (రి); 1-50 వార్తలు; 5-0 మల్లార్‌రావు; 5-15 బంగారీబాయి; 5-30 ఉస్మాన్ ఇష్తికారీ; 5-40 బంగారీబాయి; 6-30 మహిళా కార్యక్రమం; 7-0 వార్తలు; 7-15 గ్రామస్థుల కార్యక్రమం; 7-45 యుగయుగాలలో పారశర్యం:—నా॥ ఎస్. రామారావు ప్రసంగం; 7-55 మల్లార్‌రావు; 8-30 ఉస్మాన్ ఇష్తికారి; 8-40 బంగారీబాయి; 8-50 మల్లార్ రావు; 9-15 కర్నాటక సంగీతం; 10-25 కర్నాటకసంగీతం

# సంస్థాన కాంగ్రెస్ నుంచి 'అభ్యుదయ' వర్గం నిర్గమనం

## కారణాలు, లక్ష్యం గురించి భండారు చంద్రమౌళీశ్వరరావుగారి వివరణ

### తెలంగాణా కాంగ్రెస్ ఎన్నికల సందర్భంలో ప్రస్తుత కార్యదర్శి వైఖరి విమర్శ

వరంగల్, నవంబరు 23: సంస్థాన కాంగ్రెస్‌లో ఒక వర్గం కాంగ్రెసు తమ దృక్పథంతో నడవాలనే ఆకాంక్ష వలనను, కాంగ్రెసులో ప్రతిష్టంభన తేవాలనే ఉద్దేశంతోను రాజీనామా చేస్తారనే విషయాన్ని గూర్చి ప్రస్తావించగా భండారు చంద్రమౌళీశ్వరరావుగారిట్లు తెలిపిరి:

కాంగ్రెసు, కాంగ్రెసు కార్యకర్తలు, ఆ సంస్థ దృక్పథంతో నడుస్తారు కాని తమ దృక్పథంతో సంస్థ నడవాలని కోరరు. యిక ప్రతిష్టంభన తేవాలనే దృష్టితో కాదున్నా, త్వరలోనే అభ్యుదయవాదులు కొందరు రాజీనామా చేసే అవకాశాలున్నవి. ఇందుకు కారణము స్వామీజీ రామకృష్ణరావుగార్ల రాజకీయాలతో విసుగు చెందటము, కాంగ్రెసు గత పదునాల్గు నెలలనుండి ఎట్టి ప్రజాహిత కార్యం చేయకపోగా, నిర్మాణక్రమం విషయం మరిచిపోవట మేనని చెప్పవచ్చును.

ఎం. ఎస్. రాజలింగం, చంద్రమౌళీశ్వరరావుగార్లు సంస్థాన కాంగ్రెస్ కేంద్ర ప్రముఖులతో రాజకీయ విషయ ప్రస్తావనకై హైదరాబాద్ వెళ్లి నిన్ననే తిరిగి వచ్చిరి.

## తెలంగాణా కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీ

తెలంగాణా కాంగ్రెసధ్యక్షపదవికి పోటీ చేయుచున్న కోదాటి నారాయణరావు, రాజలింగంగార్ల నామినేషనులు అక్రమంగా వున్నవని కార్యదర్శి త్రోసి పుచ్చినట్లు రూఢిగా తెలియవచ్చినది.

ఈ విషయమై చంద్రమౌళీశ్వరరావుగారు ఈ దిగువ ప్రకటన చేసిరి.

సంస్థాన కాంగ్రెస్ నియమావళి, 18, వ, నూతన ఎన్నికల నియమావళి 48 వ సూత్రం ప్రకారం తెలంగాణా కాంగ్రెస్ కార్యదర్శికి నామినేషన్ పత్రాలను పరిశీలించే హక్కు గాని, నిరాకరించే హక్కుగాని లేవు. పదిమంది ప్రతినిధులు ప్రతిపాదించిన అభ్యర్థుల పేర్లను ప్రకటించే అధికారంమాత్రమే కార్యదర్శికి గలదు. కావున కార్యదర్శిగారు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయుచున్నారని తెల్లమగుచున్నది

ఈ విషయంలో స్వామీజీ జోక్యం కల్పించుకొని న్యాయాన్ని సమర్థిస్తారని, కోదాటివారి పేరును ప్రతిపాదించిన వ్యక్తులుకూడా వెంటనే ఉచిత చర్యతీసుకొనెదరని అనిపిస్తున్నాను.

## వరంగల్ జిల్లా కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీ

వరంగల్ జిల్లా కాంగ్రెసు అధ్యక్షపదవికి ప్రస్తుతం జి. కాం. కార్యదర్శిగా వున్న బాబా సంకర్ కోటయ్యగారు పోటీ చేస్తున్నారు. హిరిక కాలిపాక వెంకటకిషన్ రావుగారికి పోటీ జరుగనున్నది.

## గోధుమ రేషన్ నిర్బంధ మొనర్చుట

మదరాసు, నవంబర్ 23:—నిల్వయున్న గోధుమను విడుదల చేయుటకు గాను నవం 27 నుండి 12 ఔన్సుల రేషన్‌లోనే కార్డు పొందినవారందరికీ విధిగా ఒక ఔన్సు గోధుమ ఇవ్వవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## ప్రభుత్వ చిహ్నము

మదరాసు, నవంబరు 24:—మదరాసు ప్రభుత్వ చిహ్నములో అర్ధ చంద్రాకారముగ "సత్యమేవ జయతే" అనే మాటలను ముద్రించవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## మదరాసు గాయకపరిషత్తు

### ముదికొండ వెంకట్రామయ్యగారు అధ్యక్షతను 23 వ సభ

మదరాసు మ్యూజిక్ అకాడమీవారి 23 వ వార్షిక సభ డిసెంబరు 23 తేదీ నుండి జనవరి 1 వరకు హైకోర్టు సమీపంలోని పెవిలియన్ (?) జరుగును. ప్రధాని కుమారస్వామి రాజాగారు ప్రారంభోపన్యాసము కావించెదరు. మంత్రి మాధవమేనన్‌గారు 1 వ తేదీని ఉపన్యాసమిత్తురు. సంగీతవిద్వాంసు ముదికొండ వెంకట్రామయ్యగారు ఉపన్యాసమిత్తురు.

## వరంగల్లు మునిసిపాలిటీ కార్మికుల సమ్మె

### సంఘ అధ్యక్షుని అరెస్టు

సికింద్రాబాద్, నవంబర్ 24: వరంగల్ మునిసిపాలిటీ కార్మికులు దాదాపు వెయ్యి మంది నిన్నటినుండి సమ్మెచేస్తున్నారని హైదరాబాద్ సోషలిస్టుపార్టీ కార్యాలయానికి నేడు వార్త వచ్చింది. మునిసిపాలిటీవారు బకాయిలను ముట్టచెప్పనందుకుగాను నిరసనగా కార్మికులు పై చర్య తీసుకొన్నారట. సమ్మెసందర్భంలో వరంగల్ మునిసిపాలిటీ ఉద్యోగుల సంఘ అధ్యక్షుడు కె. ఆర్. అబ్బయ్య పోలీసులచే అరెస్టు చేయ్యబడి నాడనీ కూడ పై వార్తలో ఉన్నది. మునిసిపాలిటీ ఉద్యోగుల సంఘ ప్రోత్సాహంమీద యీసమ్మె ప్రారంభమైనదట. ఇది హైదరాబాద్ మజ్దూర్ సంఘానికి అనుబంధసంస్థ.

### మున్సిపాలిటీ వర్కర్లపై లాఠీ ఛార్జి

వరంగల్లు, నవంబరు 23:

నిన్న సాయంకాలం స్థానిక మున్సిపాలిటీ వర్కర్లు సుమారు 400 మంది జరిపిన ప్రదర్శనంపై ఎం. ఎస్. పి. దళంవారు లాఠీచార్జీ చేశారు. 15 గురు కొద్దిగాను, ముగ్గురు తీవ్రంగను గాయపడినారు. ప్రదర్శనలో పాల్గొన్న నూరు మంది పైచిలుకు స్త్రీలలో సుమారు 7 గురకు గాయాలు తగిలినవి. మజ్దూర్ సభా కార్యకర్త కె. ఆర్. అబ్బయ్యగారితో సహా 7 గురిని అరెస్టుచేసి, తర్వాత విడుదల చేసినారు. ప్రదర్శనాన్ని చూస్తూ నిలుచున్నది. శ్రీహరిగారికి మరి ముగ్గురకు దెబ్బలు తగిలినవి.

సంవత్సరన్నరనుండి రావాల్సిన కరువు బత్తెం యివ్వనందున వర్కర్లు నేటినుండి సమ్మె ప్రారంభించి ప్రదర్శనం జరిపినారని తెలిసినది. ప్రదర్శనంలో 'అధికారుల దమననీతి నశించాలి' అనే నినాదం చేయవద్దని అధికారులు కోరారనీ, కాని ఆ నినాదం చేయుటంవలన లాఠీఛార్జి జరిగిందనికూడా తెలిసినది.

## హైద్రాబాద్ సంస్థాన బ్యాంకు నిర్వహణ

### ప్రభుత్వ ప్రకటన

సికింద్రాబాద్, నవంబరు 24: హైదరాబాద్ ప్రభుత్వంవారు, ఒక స్థానిక దినపత్రికలో ప్రకటింపబడిన వార్తను ఖండిస్తూ, నేడు యీ కింది ప్రకటన చేశారు.

హైద్రాబాద్ సంస్థాన బ్యాంకు నిర్వహణ బాధ్యతలను, భారత రిజర్వుబ్యాంకుగాని, భారత ఇంపీరియల్ బ్యాంకుగాని తీసుకోబోవటంలేదు. అసలు యిటువంటి పథకాన్నే ప్రభుత్వం తలపెట్టలేదు"

## హైద్రాబాద్ జిల్లా సివిల్ పరిపాలనాధికారి

### జె. ఎ. రోబెల్లో నియామకం

హైద్రాబాద్, నవంబరు 23: బీదర్ జిల్లా సివిల్ పరిపాలనాధికారి జె. ఎ. రోబెల్లోగారు హైద్రాబాద్ జిల్లా సివిల్ పరిపాలనాధికారిగా ఛార్జి పుచ్చుకొన్నారు. ఇప్పటివరకు ఈ పదవిలో వున్న ఎస్. డబ్ల్యు. శివేశ్వర్కార్‌గారు, ఎన్నికల కమీషనరుగా పూర్తిగా ఎన్నికల కార్యక్రమంలోనే పనిచేయుటకు, సివిల్ పరిపాలనాధికారిపనివదలివేశారు. బీదర్ జిల్లా సివిల్ పరిపాలనాధికారిగా, ఇండియా అడ్మినిస్ట్రేటివు సర్వీసుకు చెందిన మేజర్ బోగ్ నియమించబడినారు.

## హైద్రాబాద్‌లో జయప్రకాశ్ పర్యటన

హైద్రాబాద్, నవంబర్ 24: భారత సోషలిస్టుపార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ డిసెంబరు 14-వ హైద్రాబాద్ వచ్చి, 9 రోజులపాటు సంస్థానమంతటా పర్యటిస్తారని తెలియవచ్చింది.

## రాజాజీకి ఔరంగాబాద్ ప్రజలచే సన్మానం

ఔరంగాబాద్, నవంబర్ 24: ఇండియా గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు అజంతా, ఎల్లోరా గుహలను దర్శించటానికి ఔరంగాబాద్ వచ్చినప్పుడు ఆయనకు సన్మానపత్రం సమర్పించవలెనని నిన్న యిక్కడ పురప్రముఖులు సమావేశమై తీర్మానించారు.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, నవంబర్ 24: శ్రీ పి. కృష్ణారావు అనకాపల్లి పరిశోధనశాల సూపరింటెండెంటుగా శాశ్వతముగా నియమించబడిరి.

శ్రీ యస్. వి. నరసింగరావు పట్నాయక్ కృష్ణాజిల్లా, శ్రీ పి. సుబ్బారావు నెల్లూరు, శ్రీ టి. ఎ. నరసింహులు నాయుడు, ఉత్తర మదరాసు కమిషనర్ యల్ టాక్సు ఆఫీసర్లుగా నియమించబడిరి.

రాజమహేంద్రవరంలో ఈ నెల 12-వ తేదీన జరిగిన నన్నయ జయంతి సందర్భపు ఫోటో. కూర్చున్నవారు కంచుమర్తి పార్థసారథి, ముక్కపల్లి సూర్యనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారలు. నుంచున్నవారు: రావులపర్తి సూర్యనారాయణ, అద్దేపల్లి నాగేశ్వరరావు, భమిడిపాటి కామేశ్వరరావు గార్లు.

# ప్రత్యేక కన్నడ రాష్ట్రసాధనకు శాంతియుత ఉద్యమం సాగించాలి

## కర్నాటక వాణిజ్యమండలి తీర్మానం

బెంగుళూరు, నవంబర్ 24: ఈసంవత్సరాంతంలోగా కర్నాటకరాష్ట్రాన్ని ఏర్పాటుచేయటానికి, కాంగ్రెస్ కార్యవర్గంవారుగాని, కేంద్రప్రభుత్వంగాని తగిన చర్యలు తీసుకొనకపోయినట్లయితే, శాంతియుతమైన ఉద్యమాన్ని ప్రారంభించి ఆందోళన చెయ్యాలని, యీ వేళ యిక్కడ జరిగిన కర్నాటక వాణిజ్యసంఘంవారు నిర్ణయించారు.

కాంగ్రెస్ కార్యవర్గంవారు ఈ రాష్ట్రం విషయం యెత్తుకోకపోవటానికి అసమ్మతిగా రాజ్యాంగపరిషత్తులోనుంచీ, శాసనసభనుంచీ కర్నాటక సభ్యులు రాజీనామాలివ్వవలసిందిగా, కర్నాటక కాంగ్రెస్ ఉత్తరువుల జారీ చేయాలనికూడా వీరు వేరొక తీర్మానం చేశారు. కర్నాటక వాణిజ్య మండలివారు యేర్పాటు చేసిన యీ సమావేశానికి వై. మహాబలేశ్వరప్పగారు అధ్యక్షత వహించారు. కర్నాటక కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి వి. టి. మాదిగ, బొంబాయి శాసనసభాసభ్యులు ఎస్. పాటిల్ మొదలైనవారు సభలో ప్రసంగించారు.

ఈతీర్మానంలో, 'కర్నాటక రాష్ట్రం వెంటనే యేర్పాటు కావటానికి తగిన సావకాశాలు చేర్చకపోయినట్లయితే నూతన రాజ్యాంగాన్ని కన్నడులు అంగీకరించేదిలేదని కూడా, పాటిల్‌గారు ప్రతిపాదించిన సవరణను చేర్చారు.

మైసూరును చేర్చకుండా కర్నాటక రాష్ట్రాన్ని యేర్పాటుచేయటం అసంభవమని కాంగ్రెస్ కార్యవర్గం తెల్పుతున్న కారణంగా మహారాజావారు 'సింహాసనాన్ని పరిత్యజించి' కన్నడ ప్రజల కృతజ్ఞతలకు పాత్రులు కావాలని ఆ తీర్మానంలో కోరారు.

మైసూరును కలుపుకొని కర్నాటక రాష్ట్రం యేర్పాటు కావటానికి, ప్రజలూ, ప్రభుత్వమూ తీవ్రంగా పని చెయ్యాలనీ, అవసరమైన పరిస్థితులు యేర్పడటానికి కేంద్రప్రభుత్వం తగిన బాధ్యత వహించాలని హెచ్చరించారు.

ఈ తీర్మానాన్ని ఆచరణలోకి తీసుకు రావటానికి, ఒక ప్రత్యేక సంఘాన్ని కూడా యేర్పాటుచేశారు. ఈ ఉద్యమం క్రింద 10 లక్షలు వసూలు చెయ్యటానికి, ప్రాథమిక ఖర్చులక్రింద 2 లక్షలు వసూలు చెయ్యటానికీ నిర్ణయించారు. అక్కడికక్కడే 20 వేలు వసూలైంది.

## దక్షిణ భారతదేశంలో అధికాహారోత్పత్తి

### కృషి సమీక్ష

న్యూఢిల్లీ, నవంబరు 23: దేశములో ఆహారోత్పత్తిని హెచ్చించుటకు వివిధ రాష్ట్రీయ ప్రభుత్వములు పైకొనుచున్న చర్యలు ఆహార శాఖోద్యోగియులద్వారా నేడు తెలిసినవి.

గత అక్టోబరు 31 తేదీతో అంతమగు పక్షములో మద్రాసు ప్రభుత్వమువారు 1,988 బావులను పూర్తిచేసినట్లు కేంద్ర వ్యవసాయశాఖవారికి తెలిసినది. తిరువాన్కూరు, కొచ్చిన్ సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము రెండు గొప్పలిఫ్టు ఇరిగేషనుస్కీములను పూర్తిచేసినది. ఇందువల్ల యిప్పుడు ఒక్కపంటమాత్రమే పండుచున్న 40 వేల ఎకరములలో రెండుపంటలు పండించ వీలగును. ఈ యూనియనులో మరియొక స్కీము ప్రారంభింప బడినది. దీనివల్ల 1,500 ఎకరములు లాభపడును. ఈ యూనియనులో అదనంగా, 1,900 టన్నుల బియ్యము ఉత్పత్తియగును. బీహారులోగూడ బావులుత్రవ్వు కార్యక్రమము శీఘ్రముగా సాగుచున్నది.

మధ్యభారత ప్రభుత్వము వారు ఈ ఋతువు 60 వేల ఎకరములకుపైగా సాగులోనికి తీసికొనిరా నిశ్చయించిరి. సం॥ రా॥ములో పైర్లను అడవిమృగముల నుండి రక్షించుటకు చర్యలు పైకొనబడినవి. తూ. పంజాబులో భూమి వినియోగ చట్టము గావింపబడినది. వ్యవసాయ యోగ్యమైన బంజరును ప్రభుత్వమువారు తమ చేతులలోనికి తీసికొనుటకు ఈ చట్టము అధికారమొసంగుచున్నది. ఇప్పుడు ఒకేపంట పండుచున్న పొలములలో రెండు పంటలు పండించుటకు మ॥ రా॥ముల ప్రభుత్వమువారు రయితులకు సౌకర్యములు కల్పించి యున్నారు. చెత్తా చందారము నుండి ఎరువు తయారు చేయు కృషి దాదాపు అన్ని రాష్ట్రములలో బాగా సాగుచున్నది. బీహారులో యిందుకై యేర్పడిన పరపతి సంఘములు ఆగస్టు మాసాంతము వరకు 44,000 గుంటలు త్రవ్వినవి. ఎరువు తయారు చేయుటకు గుంటలు త్రవ్వు నిమిత్తమై బీహారు ప్రభుత్వము వారు రయితులకు ఋణములిచ్చు సూచనను పరిశీలించుచున్నారు. ఇందువల్ల గ్రామములలో ఎరువు తయారు చేయు పని శీఘ్రముగా సాగునని భావింపబడుచున్నది.

కేంద్ర ప్రదేశములలో విత్తనముల గిడ్డంగులను, ఎరువుల గిడ్డంగులను నిర్మించు స్కీము నొకదానిని ప్రభుత్వము వారు పరిశీలించుచున్నారు. ఈ కేంద్రములనుండి పక్వమైన ఎరువు సరఫరా యగును. నవీనపద్ధతులలో వ్యవసాయము చేసి ఎక్కువధాన్యము పండించుటకు ఒరిస్సా ప్రభుత్వమువారు 5 లక్షల ఎకరములను ప్రత్యేకించియున్నారు. గ్రామసీమలలో చెత్తచెదారమునుండి ఎరువుతయారుచేయుటను నిర్బంధముగావించు ఆర్డినెన్సునొకదానిని తూ॥ పంజాబు ప్రభుత్వమువారు జారీచేసియున్నారు. 17 మునిసిపాలిటీలలోను వేయిగ్రామములలోను యిట్టిఎరువు తయారుచేయుపని ప్రారంభమైనది. నవీన పద్ధతులద్వారా వ్యవసాయము చేయుటవల్ల పంటఎంత హెచ్చినదో సరిగా తెలిసికొనుటకుగాను సి. పి. బెరార్ ప్రభుత్వమువారు అచ్చటచ్చట కోతలు ప్రారంభించియున్నారు.

# రష్యా-పాకిస్తాన్ రాజకీయ సంబంధాలు: బెవిన్‌తో నవాబ్ గుర్మాని సంభాషణ

లండను, నవంబరు 23: పాకిస్తాను సంచార రాయబారి ఐన నవాబ్ ముస్తాక్ అహమ్మద్ గుర్మానీ నేడు విదేశాంగ కార్యాలయంలో బ్రిటిషు విదేశాంగ కార్యదర్శిని చూసి మాట్లాడారు. నవాబ్ గుర్మానీ యూరపు రాజ్యాల ముఖ్యపట్టణాలన్నీ తిరిగి, డిసెంబరు ఆరంభంలో భద్రతామండలిలో కాశ్మీరు తగాదా చర్చకు వచ్చేనాటికి అమెరికాచేరి చర్చలో పాకిస్తానుకు ప్రాతినిధ్యం వహిస్తారు. ఈయన పారిసుకూ, జనీవాకూ కూడా పోయి అనంతరం అమెరికా పోతారు. జనీవాలోనే కాశ్మీరుకమిషనువారు భద్రతా మండలికి నివేదిక తయారుచేస్తున్నారు. కాశ్మీరుసమస్య పరిష్కారం గురించీ, ఆప్రాంతంలో కలిగిన రాజకీయపరిణామాలనుబట్టి ఆసమస్యకుగల ప్రాముఖ్యాన్ని గురించీ బెవిన్ గుర్మానీలు మాట్లాడినట్లు భావించబడుతున్నది.

కాశ్మీరులోని గిల్గిట్, సింకియాంగ్ (చైనా), తుర్కిస్తాన్ (రష్యా), ఆఫ్ఘనిస్తాను, పాకిస్తానుయొక్క వాయువ్యసరిహద్దు కలిసేప్రదేశం యుద్ధతంత్రరీత్యా అతి ముఖ్యమైనది. పెకింగులో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడటంచేత ఈ ప్రాముఖ్యం మరింత అయింది.

రష్యా పాకిస్తానుకు తమ రాయబారిని పంపుతున్నామని నిన్న చేసిన ప్రకటనను బట్టి ఈ ప్రాంతం విషయమై రష్యాకు గల శ్రద్ధ వెల్లడి అవుతున్నదని ఇక్కడివారంటున్నారు. ఈ రాయబారి, ఇవాన్ నికోలా యెవిట్ బాకులిన్, ఇదివరకు ఆఫ్ఘనిస్తానులో రాయబారిగా ఉండి తిరిగిపోయి సమీపమున్న ప్రాచ్యశాఖలో చేరినవాడు కూడాను.

రష్యా పాకిస్తానులమధ్య రాజకీయ రాయబారాలు ఏర్పాటు కావాలనే నిర్ణయం 1948 మే లోనే జరిగినప్పటికీ, పాకిస్తానుకు రాయబారిని పంపుతున్నట్టు చేసిన ప్రకటనే రష్యాచేసిన తొలిప్రకటన. షువాయిబ్ కురేషీ మాస్కోకు రాయబారిగా నియమించబడినట్లు నవంబరు ఆరంభంలోనే కరాచీలో ప్రకటించబడినప్పటికి రష్యను పత్రికల్లో ఈ విషయం యింకా ప్రకటితం కాలేదు. పైగా, పాకిస్తాను ప్రధాని మాస్కోకు వెళ్లడం విషయంకూడా సోవియటు పత్రికలలో ప్రచారం కాలేదు.

మాస్కోలో రాయబారిగా నియమించబడిన కురేషీ నవంబరులోనే బయలుదేరుతున్నానని చెప్పారు. లియాకతాలీ మాస్కో వెళ్లేలోపుగా రాయబారి వెళ్ళి ఉంటాడనికూడా భావించబడింది. అధ్యక్షుడు ట్రూమను లియాకతాలీని ఆహ్వానించినట్లు వార్త రాగానే ఆయన ముందుగా వాషింగ్టను పోతారా, మాస్కో వెళతారా అనే విషయమై ఊహాగానాలు బయలుదేరినవి. పాకిస్తానులోని రష్యా రాయబార కేంద్రాధికారుల నియామకం గురించి కరాచీ మాస్కోల మధ్య ఇంకా అభిప్రాయాలు కలవలేదని కొందరు అన్నారు. ఇది నిజమైతే, ఉభయ దేశాల మధ్యా రాయబార సంబంధాలు త్వరలో ఏర్పాటు చేయాలనే తొందరచేత మాస్కో నిన్నటి ప్రకటనచేసి ఉండవచ్చు.

### కృష్ణాజిల్లాలో శ్రీ సంజీవరెడ్డిగారి పర్యటన

మదరాసు, నవంబరు 24: మద్యనిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు 29 తేదీన ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి డిసెంబరు 1 విజయవాడ, జగ్గయ్యపేట, నూజివీడు (?), గుడివాడ, ముదినేపల్లి, డిసెంబరు 2 బందరు, పెదముత్తేవి, బంటుమిల్లి, నందిగామ (?), పెడన, కొల్లిపాలెం, డిసెంబరు 3 అవనిగడ్డ (?), శ్రీకాకుళం, పోతర్లంక, కొల్లిపాలెం (?) డిసెంబరు 4 బెజవాడ, తిరువూరు పర్యటించి 5 తేదీకి తిరిగివచ్చెదరు.

## ఎన్నికల ప్రచారంలో పతాకలపై నిషేధం

### బొంబై ప్రభుత్వ ఉత్తర్వు

బొంబాయి, నవంబరు 23: ఎన్నికలలో పతాకలను, జాతీయ పతాకలైననుసరే, పార్టీపతాకలైనను సరే రేపతాకలను ఉపయోగించరాదని బొంబాయి ప్రభుత్వమువారు ఒక ప్రకటనలో తెలుపుచున్నారు. ఇట్లు ఉత్తరువు చేయుటకు కారణములు తెలుపుచు వారిట్లు చెప్పుచున్నారు: పోలింగుకోజన ఉద్రేకములు పెరుగుచు, ఒక పక్షమువారు జాతీయ పతాకకు అవమానము కలిగింప ప్రయత్నింపవచ్చును. కాన ఎన్నికలలో జాతీయపతాకను ఉపయోగించుట పతాక ప్రతిష్ఠకు అనుగుణముకాదు కనుక ఎన్నికల సమయమున ఏపక్షమువారు జాతీయ పతాకలను ఉపయోగింపరాదు. ఇతర పక్షములవారు తమ పతాకలను ఉపయోగింపరాదు.

## హైదరాబాద్‌పై భారత ప్రభుత్వ పోలీసుచర్య

### సర్దార్‌పటేల్‌ను తానేమీఅన లేదని సింహళమంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 23: హైదరాబాదులో ఇండియా జరిపిన పోలీసుచర్యను గురించి పాకిస్తాన్ అ. ప్రె. విలేఖరితో కెయిరోలో తానెటువంటి అభిప్రాయాన్ని వెల్లడించివుండలేదని సిలోను వ్యవహారాల శాఖామంత్రి సర్ జాన్ కొటలావాలా ఇండియా ప్రభుత్వానికి తెలియపరిచినట్లు రూఢిగా తెలుస్తున్నది.

ఇండియాలోవున్న సిలోను హైకమిషనర్ ద్వారా ఆయన ఒక ఉత్తరాన్ని ఇండియా ప్రభుత్వానికి అందజేస్తూ పై విషయాన్ని వెల్లడిచేస్తూ, అటువంటి వార్త పాకిస్తాన్ పత్రికల్లో పడినదా అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారట.

అదీకాకుండా తాను ఇండియాను, అందులో ముఖ్యంగా సర్దార్ వల్లభాయి పటేలును గౌరవించేవార్లలో ఒకడినని, అందువల్ల ప్రజల్లో తన్నుగూర్చి ఎటువంటి విపరీతాభిప్రాయమూ కలగకుండా చేసుకోవటానికి తానీ ఉత్తరం వ్రాస్తున్నాననిగూడా ఆయన అందులో తెలియజేసినట్లు తెలుస్తున్నది.

## బెంగుళూరువద్ద ఇనప యంత్రాగారం

న్యూఢిల్లీ, నవంబరు 23: ఇండియాలో యిప్పుడున్న వాటన్నిటికన్న పెద్దదైన యంత్ర పరికరాల, ఫాక్టరీ ఒకటి మైసూరులో భద్రావతి ఇనుము కార్ఖానాకు సమీపంలో త్వరలో స్థాపించబడుతుంది. ఈ కార్ఖానాకు కావలసిన కొలిమిని జనవరిలో నిర్మించడం ప్రారంభిస్తారు. ఓర్లికాన్స్ ఆఫ్ స్విస్ కంపెనీని భాగస్వామిగా తీసుకొని భారతప్రభుత్వం 15 కోట్లు పెట్టుబడితో ఈ యంత్రాగారాన్ని నెలకొల్పబోతున్నది. స్విస్‌కంపెనీకి నూరింట 10 వంతుల షేర్లు ఇవ్వబడును. తతిమ్మా షేర్లు ప్రభుత్వం పేరట ఉంటవి.

ఫాక్టరీ బెంగుళూరు పొలిమేరలలో ఏర్పాటు చేయబడుతుంది. కేంద్రప్రభుత్వానికి ఈ ప్రాజెక్టుకు కావలసిన భూములన్నీ ఉచితంగా ఇవ్వడానికి మైసూరు ప్రభుత్వం అంగీకరించింది. ఈ ప్రాజెక్టు కింద భారతప్రభుత్వం వర్తమాన సంవత్సరపు బడ్జెటులో 50 లక్షలు, 1950-51 సంవత్సరపు బడ్జెట్‌లో 3 కోట్లు కేటాయించింది.

ఫాక్టరీ నిర్మాణంలో తోడ్పడడానికి స్విస్ సాంకేతిక నిపుణులు కొందరు అనతికాలంలోనే ఇండియాకు రానున్నారు, యంత్రపరికరాల నిర్మాణంలో తమ కంపెనీలో శిక్షణ ఇప్పించడానికి కొందరు వ్యక్తులనువీరు ఎంచుకుంటారు. ఈపథకంఅంతా మొత్తం 5 అంచెలమీద 6 ఏళ్లలో అమలు జరుపబడుతుంది. 3 ఏళ్ళలో కొన్నికొన్ని చిన్నరకాల యంత్ర పరికరాలను ఉత్పత్తి చేయడం ఆరంభిస్తారు. ఫాక్టరీ నిర్మాణంతోబాటు కార్మికులను తర్ఫీదు చేయుడానికి ఒక శిక్షణ కార్యాలయంకూడా తెరువబడుతుంది.

భారతదేశం సాలీనా 8 కోట్ల రూ. కిమ్మతుచేసే యంత్ర పరికరములను విదేశములనుండి తెప్పించుకుంటున్నది.

ఈ యంత్ర పరికరాల ఫాక్టరీనిగాక టెలిఫోన్ ఫాక్టరీనికూడా ఒకదానిని భారతప్రభుత్వం స్థాపిస్తున్నది, ఈ ఫాక్టరీని నిర్మించిపెట్టడానికి ప్రభుత్వం స్టాండర్డ్ టెలిఫోన్‌కంపెనీ అనే ఒక బ్రిటిష్ కంపెనీ సాయం తీసుకుంటున్నది; కాంట్రాక్టుమీద వచ్చేవారం లండన్‌లో సంతకాలు జరుగుతవి. అయితే యంత్ర పరికరాల ఫాక్టరీవలెగాక ఈ ఫాక్టరీ పూర్తిగా ప్రభుత్వ స్వామ్యంకిందనే ఉంటుంది. ఈ ఫాక్టరీకింద 1 కోటి రూ. పెట్టుబడి పెట్టవలసి ఉంటుందని అంచనా వేయబడినది. ఫ్యాక్టరీలో 1952 నుంచి ఉత్పత్తి ప్రారంభం అవుతుంది. ఇండియా సాలీనా 75 లక్షల రూ. కిమ్మతుచేసే టెలిఫోన్లను కేబుల్ సామగ్రిని విదేశాలనుండి దిగుమతి చేసుకుంటున్నది.

## పల్లిపట్టు రయితుల సంఘం

కావేటి నగరం జమీనులో వ్యవసాయ కూలీలు, రయితు భాగాలు ధాన్యరూపంలో యిచ్చే ఆచారం గల చోట్ల శిస్తు తగ్గింపు చట్టం అమలు జరుపునపుడు అతి శ్రద్ధగ గమనించాలని కోరుచు, పల్లిపట్టు జమీను రయితుల సంఘం వారి యిబ్బందులను తెల్పుచు, కె. వరదాచారి. టి. తాతాచారి ఆర్. నాదమునిరెడ్డి గార్లు రివిన్యూ మంత్రి గారి వద్దను రాయబారం వెడలిరి. వారు శ్రద్ధగ విని తగుచర్య పైకొందుమనిరి.

## నౌకా నిర్మాణశాల కార్మికుల యూనియన్

### సింధియాకంపెనీని ప్రభుత్వం వశపర్చుకోవాలని తీర్మానం

విశాఖపట్నం, నవంబరు 21: సింధియా నౌకా నిర్మాణశాలను కేంద్ర ప్రభుత్వం స్వాధీన పరచుకోవటాన్ని విరమించిందని ఈమధ్య వెలువడిన ప్రకటన ఫలితంగా కార్మికులలో ప్రబలిన కలవరపాటును పురస్కరించుకొని నౌకానిర్మాణశాలా ఉద్యోగుల యూనియన్ సర్వసమావేశం నేడు ఉపాధ్యక్షుడు శ్రీ బీసెట్టి అప్పారావు గారి అధ్యక్షతను జరిగింది.

యూనియన్ కార్యదర్శి నూరిసెట్టి సాంబశివరావు ఖాజ్జి మాట్లాడుతూ ఈ సమయంలో కేంద్ర ప్రభుత్వం సింధియా కంపెనీని స్వాధీనం చేసుకోకపోతే కార్మికులు చాల కష్టనష్టాలకు లోనవుతారని అన్నారు. నిర్మాణశాలను వశపరచుకొనే విషయమును కేంద్ర ప్రభుత్వం ఇంకా ఆలోచిస్తున్నట్లు నమ్మకంగా తెలిసిందనికూడా ఆయన అన్నారు.

అధ్యక్షోపన్యాసం తర్వాత నిర్మాణశాలను వెంటనే వశపరచుకొని సాంకేతిక పరిశ్రమను ప్రభుత్వం అభివృద్ధి చెయ్యాలని, ఒకవేళ వశపరచుకోవటం సాధ్యం కాని పక్షంలో నౌకా ఉత్పత్తికి కార్మికుల ఉద్యోగములకు భంగము రాకుండా చేసే మార్గమునేదైనా అనుసరించవలెనని ప్రభుత్వమును ప్రార్థించుటకు సభవారు తీర్మానించారు.

## మోటార్లు పెరిగినా ప్రమాదాలు తగ్గినవి

### మదరాసులో పోలీస్ ఏర్పాట్ల ఫలితం

మదరాసు, నవంబరు 24: "మదరాసులో మోటారులసంఖ్య 9030 వరకు పెరిగినా సెప్టంబరులో అంతమయ్యే మూడు నెలలలో ప్రమాదముల సంఖ్య 600 నుండి 493 వరకు తగ్గినది" అని ఆర్. కె. సుకుమారన్ గారు పోలీసు డిప్యుటీకమిషనరు తెలిపిరి. నగరంలో కొన్ని ప్రాంతాల హారను మ్రోగించకుండా, 10 మైళ్లకు మించకుండా, ముందు బండిని దాటిరాకుండా నడవాలని నియమములు అమలు జరుపుటవల్లను, రోడ్లుదాటే కాలిబాట లేర్పరచి, నడిచేవారిని తరుచు పోలీసు ట్రాఫిక్ మోటారు ద్వారా హెచ్చరించు చుండుటచే యిట్టి ఫలితము చేకూరెనని వారు తెలిపిరి. జనరలు ఆస్పత్రివద్ద యిట్టి నిర్బంధమును లేర్పరచుటచే, రోగులకు శాంతి కలిగెను. మౌంటురోడు రౌండుఠానా వద్దకూడా యిట్టి నిర్బంధము లేర్పరచిరి. ఇతర ఆస్పత్రులన్నింటి చేరువను యిట్టి నియమము లనుసరింపదలచిరి. ఇంకే శాక ఆశేక తావులందు మోటారుల వడి తెలుసుకునే యంత్రాలు పెట్టి మితిమీరి నడిచిన డ్రైవరులను శిక్షించుచున్నారు.

## రాజకీయ బాధితులకు భూములు

### భూములు తీసుకున్న శాసనసభ్యుల వివరములు

మదరాసు, నవంబర్ 24: నేడు అసెంబ్లీలో రాజకీయ బాధితులుగా భూములు మంజూరుచేయించుకున్న శాసన సభ్యులు గురించి ఒక సభ్యుడు ప్రశ్నించెను.

రివిన్యూమంత్రి సమాధాన మిచ్చుచూ ఆంధ్ర ప్రాంతంలో పశ్చిమ గోదావరిలో శ్రీ ఆత్మకూరి గోవిందాచారి ఎం. ఎల్. సి. గారికి య 5-00 లు శాశ్వతముగ దఖలుచేయబడినదని తెలిపిరి. కృష్ణా జిల్లాలో శ్రీ వేముల కూర్మయ్యగారికి య 2-21 లు, శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గారికి (మరిద్దరితో కలిపి) య 16-00 లు గుంటూరుజిల్లాలో శ్రీ ఎ. యారన్ రావుకు య 4-72 లు, పుష్పా సుబ్బయ్యగారికి య 4-72 లు, నెల్లూరులో ఎల్. సుబ్బారామ రెడ్డిగారికి శాశ్వతముగా య 3-64 లు, అనంతపురంలో శ్రీ ఎస్. సంజీవరెడ్డి గారికి య 15-0 లు, శ్రీ కల్లూరి సుబ్బారావుగారికి య 15-23 లు, శ్రీ జి. వెంకటసెట్టిగారికి య 15-0 లు, శ్రీ డి. వెదిరప్పగారికి య 15-0 లు, కర్నూలులో నివర్తి వెంకటసుబ్బయ్యగారికి య 10-06 లు, చిత్తూరులో శ్రీ సి. టి. యన్. రామకృష్ణారెడ్డిగారికి శాశ్వతముగా య 2-0 లు, మంజూరుచేయబడినదని మంత్రిగారు తెలిపిరి.

రివిన్యూమంత్రి ఇట్లే ఇతర జిల్లాలలో భూములు మంజూరు అయిన శాసనసభ్యుల పేర్లను తెలిపిరి.

### సూచన

ఆంధ్ర రాష్ట్రం వచ్చుచుండని ఉబ్బరంగా ఆంధ్రులు మురిసి పోతున్నారు. రాష్ట్రం యొక్క రాజధాని నగరం ఏది కాగలదైన్నప్పటికీ దానిలో కీ॥ శే॥ కొండా వెంకటప్పయ్యగారి విగ్రహం స్థాపించాలని, సి. రంగనాయకులు చెట్టిగారు సూచించుచున్నారు.

# రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి సంస్థలు ప్రభుత్వ స్వాధీనం

## సవరణబిల్లుపై అసెంబ్లీలో చర్చ: సెలెక్టు కమిటీకి నివేదన

మదరాసు, నవంబరు 24: నేడు మదరాసు అసెంబ్లీ స్పీకరు శ్రీ జె. శివషణ్ముగంపిళ్లై అధ్యక్షతను సమావేశమైనప్పుడు మదరాసు ప్రభుత్వ పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ యం. భక్తవత్సలంగారు 1949 సం॥పు విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థల స్వాధీనపు బిల్లును సెలెక్టుకమిటీకి పంపకోరుచు ప్రతిపాదించిరి.

### శ్రీ భక్తవత్సలం ఉపన్యాసం

మంత్రి భక్తవత్సలంగారు విద్యుచ్ఛక్తి సప్లయి కంపెనీల స్వాధీనం చేసుకొను బిల్లును అసెంబ్లీలో యీ దినం ప్రవేశ పెట్టుచూ యీ విధమున ప్రసంగించిరి.

మదరాసు ప్రభుత్వము 20 యేండ్ల క్రిందట తను విద్యుత్ శాఖను ఏర్పాటు చేసినది. విద్యుత్ ఉత్పత్తి భారీఎత్తు పరఫరామీద మాత్రమే శ్రద్ధ వహించుట అప్పటి విధానమై యుండెను. విద్యుచ్ఛక్తిని చిల్లరగా సప్లయి చేసేబాధ్యత మాత్రము ప్రైవేటు లైసెన్సీలకు ...

... తలపెట్టుచుండిరి. ఆ కారణముచేత వారు గ్రామీణుల అవసరములు తృప్తిపరుపలేకపోయిరి. రాష్ట్రప్రజలు విద్యుత్ సప్లయి కావలెనని ఆత్రపడుచున్నందున ప్రభుత్వమువారే ప్రజలకు విద్యుచ్ఛక్తిని సప్లయిచేసే బాధ్యతను వహించుటకు నిశ్చయించియున్నారు. రాష్ట్రంలోగల పైకారా మెట్టూర్ పాపనాశం హైడ్రో విద్యుత్ ప్రాజెక్టులు-మదరాసు విశాఖ, కాకినాడ, విజయవాడలలోని థెర్మల్ స్టేషన్లుకలిపి మొత్తంమీద రాష్ట్రమునకు కావలసిన విద్యుచ్ఛక్తిలో 99% తయారు చేస్తున్నవి. మూడు హైడ్రో ఎలెక్ట్రిక్ స్టేషనులు ఒకదానికొకటి ఒక గ్రిడ్‌లో కలుపబడియున్నవి. మదరాసు థెర్మల్ స్టేషనును హైడ్రోఎలెక్ట్రిక్ గ్రిడ్‌లో కలిపే ఉద్దేశ్యమున్నది. 1952 సం లోగా పూర్తికాగల మాంచ్‌ఖండ్ తుంగభద్రా హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టు సప్లయి ...

### కంపెనీల కిచ్చే ధరలు

...

### అతి మూత్రవ్యాధి ఏడు రోజులలో నిమ్మళించినది

...

వీనస్ రిసర్చి లేబరేటరీ (A.P.) పోస్టు బాక్సు 587, కలకత్తా.





... రము యే సమయమున ఎప్పుడు ఏ రూపంలో యివ్వవలెనో బిల్లులో నిష్కర్షగా తెలుపకపోవడం విమర్శించిరి. నరసరావుపేటవంటి కొన్ని విద్యుచ్ఛక్తి కంపెనీలకు కావలసిన యంత్రసామగ్రి లేక సరిగా పనిచేయలేదుగాని వాటికి యితరలోపాలేమాత్రం లేవనిరి. అట్టివాటికి ప్రభుత్వము యంత్రములొసగి ప్రోత్సహించితే పని సాగుటకు అవకాశము లేకపోలేదనిరి. ఈ కారణములచే బిల్లును సెలెక్టుకమిటీకి నివేదించుటకు బదులుగా ప్రజాభిప్రాయమును బడయుటకు ప్రకటించవలెనని కోరిరి.

శ్రీ యల్. యస్. గోపాలస్వామిగారు ప్రైవేటు విద్యుచ్ఛక్తి కంపెనీలను ప్రభుత్వము వశపరుచుకొనుటకు గడువు పెట్టి ఆలోగా కంపెనీలు సమర్థముగా నిర్వహింపబడకపోతే ప్రభుత్వం స్వాధీనం చేసుకొనునని ప్రకటించుట మంచిదనిరి.

రజాఖాన్‌గారు చిత్తూరులో విద్యుచ్ఛక్తి సప్లయికి తగినసైన సౌకర్యములేవని ప్రభుత్వము ఈ బిల్లును ...

### మంత్రిగారి జవాబు

...

### ఫలహారానంతర చర్చ

...

... బాగుండదని నాకు చెప్పిన రెండు నెలలలో ఆ కంపెనీ తీసుకోమని కోరెను. ... కంపెనీ తీసుకోమని ప్రజలు తొందర పడుచున్నారు. దానికి అవకాశం యిచ్చితిమి. కంపెనీలలో పెట్టుబడివారి వల్ల వారి వను వ్యత్యాసం చూపలేను ... వస్తువుల విలువకట్టే వ్యక్తి ఒక్కడే ఉన్నాడు కనుక అతని సేవను ఉపయోగించుకొనుచున్నాము.

"రాజులు వ్యాపారం చేయరాదని ఆశోపని సూక్తి ... గారు వ్యాపారస్తులు గనుక, ఉదహరించిరి. ఇపుడు మనమంతా రాజులమే కనుక, కొందరు రాజులకు మాత్రం లాభం చేకూర్చుట్లు చేయుదలచుకోలేదు.

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఈ చట్టానికి సంబంధం లేదు. ఈ చట్టంవల్ల ఆంధ్ర ప్రాంతాలేకాక, అరవ ప్రాంతాలుకూడ లాభం పొందును." అని చెప్పి సవరణ నెదిరించి బిల్లును సెలెక్టు కమిటీ పరిశీలనకు పంపమని కోరిరి.

సవరణ ఉపసంహరించుకొనబడెను.

### మరికొన్ని ప్రభుత్వ బిల్లుల ఆమోదం

...

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras

## తుంగభద్ర ప్రాజెక్టు

### బాగాసాగుచున్నదని శ్రీ భక్తవత్సలం ప్రకటన

చెన్నపట్నం, నవంబరు 24: తుంగభద్రప్రాజెక్టు పని బాగుగా సాగుచున్నదనియు, ఆనకట్ట నిర్మాణము సందర్భమున హైద్రాబాద్, మద్రాస్ ప్రభుత్వముల మధ్య తగాదాలు పరిష్కారమైనవనియు, ఏకీకరణ నిర్మాణసందర్భమున సమాధానము కుదరలేదనియు, అయినా 15 రోజులకొకసారి ఉభయ చీఫ్ ఇంజనీర్లు సమావేశమై చర్చించుచున్నారనియు, భారత ప్రభుత్వమునకు ఆశీవృద్ధిని తెలుపుచున్నారనియు మరమ్మతు ఇలాకా మంత్రి భక్తవత్సలం గారు నేడు మద్రాసు అసెంబ్లీలో నివర్తి వెంకట సుబ్బయ్యగారికి సమాధానముగా తెలిపిరి.

శ్రీ కె. భాష్యం: ఇంతవరకు ఎంత మొత్తం ఖర్చయినది?

స: వ్యవధి కావలెను.

శ్రీ నివర్తి: హైలెవల్ ఛానల్ దర్యాప్తు అయినదా?

స: వ్యవధి కావలెను.

శ్రీ ఆర్. వి. స్వామినాథన్: ఆంధ్రరాష్ట్రం వస్తున్నందున ఇక ఆంధ్రులు ఈ వ్యవహారం చూసుకోవడానికి దీనిని ఇంతటితో ఆపరాదా?

స: నాకా ప్రశ్న గ్రాహ్యం గా కుండా ఉన్నది.

హుస్సేన్ సాహెబ్: ఇందువల్ల తమిళాంధ్ర కర్నాటక ప్రాంతములకు లాభించునుగదా?

స: ఒక్క ఆంధ్రప్రాంతమునకే.

### సివిల్ సప్లయి కేసుల అప్పీళ్లు

మంత్రులకు, కార్యకర్తలకు, ఆహార వ్యవసాయశాఖలకు పనితగ్గించుటకు సివిల్ సప్లయిలశాఖకు సంబంధించిన అప్పీళ్లను రెవెన్యూబోర్డుకే పంపవలెనని ప్రభుత్వం వారు నిర్ణయించినారనియు, లైసెన్సుల రద్దు సందర్భమున అధికారము ప్రభుత్వము వారి చేతుల్లో ఉండుననియు, మరీ అన్యాయము జరిగిన సందర్భములందు మంత్రులు రికార్డులు తెప్పించుకొని న్యాయముచేయ వచ్చునని ఆహారమంత్రి జమాలీసాహెబ్ గారికి సమాధానము చెప్పిరి.

ఉపప్రశ్నలకు సమాధానముగా ఇందువల్ల సిబ్బంది తగ్గింపు ఉండదు కాలహరణము జరుగదని మంత్రిగారు తెలిపిరి.

### హైద్రాబాదులోని మద్రాసు ఉద్యోగులు

హైద్రాబాదుకు పంపిన పోలీసు ఉద్యోగులకు జీతమునకు తోడు డెప్యుటేషను అలవెన్సు, అధికధరల అలవెన్సు ఇవ్వబడుచున్నదని వెన్నెలకంటి రాఘవయ్య గారికి సభానాయకులు సమాధానమిచ్చిరి. ఉపప్రశ్నలకు సమాధానముగా రెవెన్యూ ఉద్యోగులకుగూడా అట్టి సౌకర్యములే ఉన్నవనిరి. నాన్‌గెజెటెడ్ ఉద్యోగులకు ఇవ్వవలసిన సౌకర్యముల సందర్భమున మద్రాసు హైద్రాబాదు ప్రభుత్వములకు ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నవనిరి. రజాఖాన్‌గారి ప్రశ్నకు సమాధానముగా ఆంధ్రరాష్ట్రమునుగూర్చి మద్రాసు ప్రభుత్వానికి ఇంకా ఏమీ రాలేదు గనుక ఆ ఉద్యోగులను ఇంకా ఆంధ్రరాష్ట్రమునకు పిలవవలసిన అవసరము కలుగలేదనిరి.

### గ్రామ వైద్యులు

మహ్మద్ ఇస్మయిల్ గారికి, సమాధానముగా ప్రజారోగ్య మంత్రి చెన్న రాష్ట్రములో నాల్గు ప్రాంతముల నాల్గు శిక్షణాలయములు పెట్టి ఒక్కొక్క చోట 65 మంది వైద్యులకు శిక్షణ ఇచ్చుచున్నారనిరి. ఈ శిక్షణ ఇచ్చినంతమాత్రమున పరిపూర్ణ వైద్యులగుదురని గాదనియు, గ్రామాల్లో చేయవలసిన కార్యక్రమమునకు దారి చూపించెదరనియు తెలిపిరి.

### రైలు మార్గాలు

నీలంబూర్, షోరనూరు, మధుర రైలుమార్గములు పునరుద్ధరించుటకు భారత ప్రభుత్వంవారు ఒప్పుకొనిరనియు, మరి కొన్ని ఆలోచనచేయుచున్నారనియు మరమ్మతు యిలాకా మంత్రి మహమ్మదు ఇబ్రహీంగారికి మరమ్మతు యిలాకా మంత్రి సమాధానమిచ్చిరి. దినుమర్తి రామస్వామిగారికి సమాధానముగా సాలూరు పార్వతీపురం లైనుకు భారతప్రభుత్వం ఒప్పుకొనలేదనిరి. తాము మంత్రి అయినాక ఏ ఒక్క మార్గము ఇంకనూ పునరుద్ధరింపబడలేదనిరి.

### భూమి శాసనం

భూములు విభజనతో ముక్కలై పోకుండ, నిష్ప్రయోజనములు గాకుండానూ ఉండుటకు శాసనముచేయు విషయము ప్రభుత్వ ఆలోచనలో ఉన్నదని రెవిన్యూ మంత్రి ఇస్మయిల్ గారికి సమాధానముగా తెలిపిరి. ఈపని త్వరగా జరుగవలెనని న్యాయమూర్తి మాసేగారు తీర్పులో చెప్పలేదా అనగా హైకోర్టు న్యాయమూర్తులు అనేక విషయములు చేయుచుందురని పలాంగారి ప్రశ్నకు రెవిన్యూమంత్రి తెలిపిరి.

వెన్నెలకంటి రాఘవయ్య గారికి సమాధానముగా ఇత్రినేషను శాసనము చేయు ఉద్దేశం ప్రభుత్వము మానలేదని రెవెన్యూ మంత్రి తెలిపిరి.

### జమీందారీలు

గొడ్డం పన్యాసిరావుగారికి సమాధానముగా జమీందారీల స్వాధీనము చేసుకొను కార్యక్రమం ఆర్థిక సూత్రముల పైననే గాక పీలునుబట్టి జరుగుచున్నదనిరి. చెముడువంటి చిన్న జమీలముందు తీసుకొనుట మంచిదిగాదా అనగా అన్ని జమీలను ఏదావిలోగా సాధ్యమైనంత త్వరలో తీసుకొందుమనియు తెలిపిరి.

# రాష్ట్రపతి డా. పట్టాభి సేవా ప్రశంస

## 70-వ జన్మదినోత్సవ సమావేశం: నగరప్రముఖుల ప్రసంగాలు

మదరాసు, నవంబర్ 24:—రాష్ట్రపతి డాక్టరు పట్టాభి సీతారామయ్య గారి 70 వ జన్మదినోత్సవము నేటి సాయంత్రం ఆంధ్రజిల్లా కాంగ్రెసు యాజమాన్యమున చెన్నపురి ఆంధ్ర మహాసభ యాజమాన్యమున జరిగెను.

మదరాసు ఆంధ్ర జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కె. వి. స్వామిగారు ప్రతిపాదించగా మదరాసు మేయరు శ్రీ పి.వి. చెరియన్ అధ్యక్షత వహించిరి.

సభాకార్యక్రమము శ్రీమతి టి. జి. కమలాదేవి గారి (జయహో ఆంధ్ర జననీ) అనే జాతీయగీతముతో ప్రారంభమయ్యెను.

మదరాసు ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు మదరాసు మేయరుగా ఎన్నికొనబడిన డాక్టర్ చెరియన్ గారికి సభవారి తరఫున అభినందనలు తెలుపుచు నేడు కలలు కొన్ని నిజమవుతున్నవనిరి.

స్వరాజ్య సిద్ధి, జమీందారీ రద్దు, సంస్థానముల విలీకరణ వాస్తవ విషయములయి మన తరములో రెండు మూడేళ్లలో జరిగిపోయినవి. డాక్టరు పట్టాభి గారు భాషాప్రయుక్త రాష్ట్రోద్యమ నాయకులు. 1917, 18 లోనే డాక్టరు గారు "ఆంధ్రరాష్ట్రం" అనే పుస్తకమును ప్రచురించిరి. నేడు ఆయన నాయకత్వము లేకుంటే ఆంధ్రరాష్ట్రము వచ్చేదేగాదు.

కాంగ్రెసు చరిత్రకారుడుగా డాక్టరు పట్టాభిగారు ప్రసిద్ధికెక్కిరి. నేడు వారి హయాములో చరిత్రను సృష్టించుచున్నారు. వారు కాంగ్రెసు అధ్యక్షుడుగా వుండగా ఆంధ్రరాష్ట్రము ఏర్పడినది. భాషారాష్ట్రములు స్వార్థపరత్వములో వ్యవహరించక కేంద్రముక్రింద పనిచేయుచుండవలెను. ప్రధాన నగరములు బొంబాయి, కలకత్తా, మదరాసులు ఏ ఒకరికి చెందక బహుజనులకు చెందినవిగా వుండవలెను. 1937 లో మంత్రివర్గము లోనికి రమ్మని ఆహ్వానించినను రాలేదు. డా॥ గారికి అధికారములోనికి రావలెనని గాని పదవీ వ్యామోహముగాని లేదు. అట్టివారికి కాంగ్రెసు అధ్యక్షత లభించింది. వారు అధ్యక్షుడుగా ఎన్నికొనబడుట మనకందరికీ ముఖ్యముగా దక్షిణాదివారికి గర్వించతగిన విషయం. "ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పుడు నేను దేశాంతరములు సముద్రాంతరములనుండి చూచి ఆనందించెదనని" డాక్టరుగారనిరి. ఈమాటలు నాకు కష్టం కలిగించెను. వారు అట్లు అనకుండా ఆంధ్రరాష్ట్రమును స్వయంగా శ్రద్ధతీసుకొని నడిపెదననిఅంటే సంతోషించెడివాడననిరి. వారి ఆశయనిర్వహణకు భగవంతుడు డాక్టరుగారికి ఆయురారోగ్యము లొసగుగాకయనిరి.

శ్రీ గుంటూరు నరసింహారావుగారు డా॥ పట్టాభిగారి వ్యవహార దక్షతనుగురించి చెప్పిన తరువాత మదరాసులోని పాఠశాలలు గ్రంథాలయములలో నేటికి తెలుగు పత్రికలు రావో మేయరు విచారణ చేయించవలెననిరి.

శ్రీ మాగంటి బాపినీడుగారు మాట్లాడుచు డాక్టరు ఏమిచేసినా వాయువేగముతో చేయు అలవాటు గలవారనిరి. పాదుపు ఆనేదానిని వారినుండే తెలుసుకొనవలెను. కాంగ్రెసు చరిత్రఅంతా చిత్తుకాగితాలమీదనే వ్రాసియున్నారు.

పట్టాభిగారు రాష్ట్రపతిగ వున్నందుననే మనకు రాష్ట్రం వచ్చిందనిరి.

శ్రీ యం. కె. వి. రెడ్డిగారు డాక్టరు పట్టాభి చరిత్రకారుడు వక్తయేగాక గొప్ప రాజకీయవేత్త యనిరి.

శ్రీ సి. తిరువెంగడం నాయకర్ తమిళములో ఉపన్యసించుచు డాక్టరుగారిని అనుసరించుటయే వారికి మనం అర్పించతగిన ధన్యవాదములనిరి.

శ్రీమతి కుట్టిమాళు అమ్మగారు డాక్టరుగారి ఔదార్యమునుగురించి అతిథి, అభ్యాగతి సత్కారములనుగురించిచెప్పి వారికి ధన్యవాదము లర్పించిరి.

డాక్టరుగారు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడుటలో విశేష మేమీలేదు ఎన్నడో వారు అధ్యక్షులయి వుండవలసినదని అబ్దుల్ హమీద్ ఖాను అనిరి. డాక్టరు బహుముఖాలుగా దేశసేవచేశిరని అన్నారు. డాక్టరుగారు పట్టు విడుపులు గల మనిషి. ఇందుకు ఇటీవల కర్నూలులో వారు జాతీయభాష విషయమై చేశిన ప్రకటనయే నిదర్శన మనిరి.

శ్రీ ఆర్. వెంకటరెడ్డిగారు డాక్టరుగారికి వారి 70 జన్మదినోత్సవ సందర్భమున జోహార్లు అర్పించుచూ ఇంతకుపూర్వము మాట్లాడిన తమిళసోదరుడు తిరువెంగడం గారు డాక్టరుగారు తమిళులవలన అధ్యక్షుడుగా ఎన్నికొనబడినవనియు వారంటే గౌరవ ప్రపత్తులు ఎక్కువ అనియు చెప్పిరి. అంత గౌరవము వున్నప్పుడు వారు మదరాసునగరమునుగురించి చెప్పే మాటలను కూడ శిరసావహించవలెననిరి.

డాక్టరు యం. కృష్ణారావుగారు మొదట్లో తెలుగులో మాట్లాడుచు నేను కన్నడుడను, చదువుకున్నది తెలుగు అని అన్నారు. నాకు వారియెడల పితృభావమున్నదనిరి. డాక్టరుగారు నిర్భీతిగా విమర్శించు అలవాటుగలవారు. మనోనిబ్బరమునకు, ధైర్యమునకు వారిని చెప్పకొని మరెవరినైనా చెప్పాలనిరి. డాక్టరుగారి చాకచాక్యమువల్లనే ఆంధ్రరాష్ట్రము ఏర్పడినదనిరి. ఆయన పేరు చరిత్రప్రసిద్ధము కాగలదనిరి.

ఆంధ్ర జాతీయ కళాశాల, డాక్టరుగారంటే ఆంధ్రు లెటువంటివారో ఇతర రాష్ట్రములవారు తెలుసుకోకలిగే వారని శ్రీ వారణాశి వెంకటాచలంగారనిరి. దేశము రాష్ట్రములు భాషాప్రయుక్తంగా విభజించవలెనని మొదటినుండీ చెప్పినది డాక్టరుగారే. క్లిష్ట పరిస్థితులు కలుగునట్లు మాట్లాడటం దానిని పరిష్కరించటం డాక్టరుగారి అలవాటనిరి. దేశసేవ నిమిత్తం ఉద్యోగములు వదులుకున్న వారికి జీవనోపాధి కల్పించుటకుగాను డాక్టరుగారు అనేక సంస్థలను స్థాపించిరని అన్నారు.

శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు ఉపన్యసించుచూ ఆంధ్రు లందరూ డాక్టరుగారి నుండి వారి పట్టుదలను వ్యవహారదక్షతను నేర్చుకోవాలనిరి. రిపబ్లిక్ తో పాటు, ఆంధ్రరాష్ట్రము డాక్టరుగారి హయాములో రావటం ముఎంతేయూ సంతోషవిషయ మనిరి.

శ్రీ సుసర్ల బ్రహ్మదేవశాస్త్రిగారు మాట్లాడుచు డాక్టరుగారు అధ్యక్షుడుగా వుండగా ఆంధ్రరాష్ట్రము రావటం ముదావహమని అన్నారు. ఆంధ్రరాష్ట్రమును సురాష్ట్రమొనర్చుటకు డాక్టరుగారు పాటుపడవలెనని కోరుచు దీర్ఘాయుష్కులుగావలె ననిరి.

జనాబ్ బియబానీ సాహెబ్ హిందూస్థానీలో మాట్లాడుచు రాష్ట్రపతికి ధన్యవాదము లర్పించిరి.

అధ్యక్షుడు డాక్టరు పి. వి. చెరియన్ గారు మాట్లాడుచు మనిషి 70 జన్మదినం జరుపుకొనుట శుభసూచకమనిరి. డాక్టరు ప్రోద్బలము ప్రోత్సాహమువలన నేను కాంగ్రెసులో చేరినాను. నేటి ఉపన్యాసములవలనే డాక్టరుగారియెడల ఈ రాష్ట్రవాసులకు గల ఆదరాభిమానములు వెల్లడికాగలవు. డాక్టరుగారు ప్రపంచములోని నాయకులలో ఒకరు. శీలవంతుడు. ఏ రంగమునందైననూ సులభముగా నాయకత్వము వహించగల్గినటువంటివాన్నీ వహించదగినవారు.

మదరాసు విషయమై మాట్లాడుచు నగరం ఎవరిదైనా అందరికీ చెందునట్లుగా చేయాలనిరి. మదరాసు బహుభాషా నగరం. గౌరవ, మర్యాద, విచక్షణజ్ఞానము గలవారెవరైనా నగరం అందరికీ చెందునట్లు, బహుభాషా ప్రాంతముగా వుండునట్లు చూడగలరు. నగరం మాది మాది అని పోట్లాడుకొనుటకంటె మర్యాదాశీలురు ఇక్కడి ఆంధ్రులను, తమిళులను సమానముగా చూడగలరని అన్నారు.

ఆంధ్రజిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కె. వి. స్వామిగారి అభినందనలతో సభ ముగిసెను.

### ఢిల్లీలో సన్మానసభ

న్యూఢిల్లీ, నవంబరు 24: 70 వ జన్మదినోత్సవ సందర్భంలో రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్య గారిని అభినందించడానికి ఈ వేళ సాయంత్రం ఒక సన్మానసభ ఏర్పాటుచేయబడింది. ఈ సభలో రాష్ట్రపతి ఉపన్యసిస్తూ, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి భారతప్రభుత్వం అంగీకరించిందని, తెలుగు రాష్ట్రం జయప్రదం కాగలదని ఆశిస్తున్నాననీ చెప్పెను.

భాషాప్రయుక్తరాష్ట్ర పునర్విభజనకు ఆంధ్రరాష్ట్రనిర్మాణం నాందీ ప్రస్తావన వంటిది. కేరళ మహారాష్ట్ర మొదలైన మిగతా భాషారాష్ట్రాలుకూడా వెనువెంటనే ఏర్పడగలవని ఆశిస్తున్నాను."

మద్రాసునగరం ప్రసక్తితెచ్చి, తాను వ్యవహారజ్ఞుణ్ణి కాబట్టి నగరాన్ని ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలన్న కోర్కెను వదులుకున్నానని, చెప్పిరి.

ఇండియాలోని బ్రిటిష్ హైకమీషనరు సర్ ఆర్చిబాల్డ్ నై, అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్, ఆర్. ఆర్. దివాకర్, దేశబంధు గుప్తగారలు డా॥ పట్టాభి సీతారామయ్యను ప్రశంసించిరి. డా॥ పట్టాభి శ్రేయోభిలాషుల తరఫున లంకా సుందరం గారు రాష్ట్రపతికి ఒక ఖద్దరు ధోవతిని కానుకను బహూకరించెను.

### పటేల్ సందేశం

న్యూఢిల్లీ, నవంబరు 24: సర్దార్ పటేలు ఈవేళ రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారికి 70 వ జన్మదినోత్సవ సందర్భాన ఒక అభినందనసందేశంపంపెను. ఇంకా కె. ఎమ్. మున్షీ మొదలైన ప్రముఖులుకూడా అనేకులు సభాశంసలు పంపిరి.

### కాలేజీ ఉపాధ్యాయుల యూనియన్ వార్షిక సభ

మద్రాసు, నవంబరు 24: "కాలేజి ఉపాధ్యాయుల యూనియన్" వారి వార్షిక సమావేశం డిసెంబరు 29, 30 లలో మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో (తాంబరం) జరుగుతుంది. క్రిస్టియన్ కాలేజీ ప్రిన్సిపాలు డా॥ బి జె. బాయిడ్ ప్రారంభోపన్యాసం చేస్తారు. మద్రాసు విశ్వవిద్యాలయ గణితాచార్యులు డా॥ఆర్ వైద్యనాథస్వామి అధ్యక్షత వహిస్తారు.

### మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 25:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 77-2-0 కొత్త బంగారు తులం 115-8-0 మాసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-కి (రెడి 172-0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్సుకోస్తాగిడ్డంగులు) మెషీను (సేల్సుటాక్సుతో సహా) బజారుకొత్తది. (కోరమాండల్) 158-0-0, 159-0-0

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (ఏపరేజ) డిసెంబరు డెలివరి రు. 337-0-0

3 టు 5% యఫ్. యఫ్. ఎ, కెంకాయనూనె(37 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వొలాన్. రు. 36-0-9, 37-0-9

ఆముదం

కాండి 500 పౌనులుగలది చిల్లరగా రు 250-0-0, 255-0-0

పంచదార

ప్యారీ (2 అందరు) రు.91-14-6